సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 48
సంచిక 18
**29-12-54**

జయ పుష్య శుద్ధ చవితి బుధవారం

# "రాజమండ్రీ వెళ్లబోకు రంగుబట్టా కట్టబోకు"

"రాజమండ్రీ వెళ్లబోకు, రంగు బట్ట కట్టబోకు...పాడై పోతావు రా నాయనా!..." అని నా చిన్నతనంలో మా ఇంట్లో పనిచేసే కుర్రవాడు కాలక్షేపం కోసం పాడుకునే మాటలు నా బుర్రని గట్టిగా పట్టుకుని వుండడం వల్లనేమో, నాకు రాజమండ్రి వెళ్లడమంటే మనసు ఒప్పుకోదు. వీలయినంతవరకు వెళ్లడం మానుకుంటాను. తప్పనిసరి అయితే ముక్తసరిగా పనిచూసుకొని రైల్లో పడే తత్వం కాది. ఏవేవో కొన్ని కారణాలు నేతిలా పేరుకొని రాజమండ్రి పేరులోనే అసహ్యం వున్నట్లు స్థిరాభిప్రాయం ఒకటి ఏర్పడిపోయింది.

## విషయానుక్రమణిక


ముఖచిత్రం:— శ్రీ రాజరాజేశ్వరీవారి "సతి సక్కుబాయి"లో ఎస్. వరలక్ష్మి.

"రాజమండ్రీ వెళ్లబోకు రంగుబట్టా కట్టాబోకు— 2

శిల్పానికి చక్కిలిగింతలు— 5

"యమధర్మరాజుగారు సమిలి మింగిన తెలకపిండి— 12

సందేశం— 23

దెబ్బతిన్న అహంకారం 24

వనితాలోకం— 30

బొమ్మరిల్లు— 36

టామ్‌సాయర్ ప్రపంచయాత్ర— 38

నాన్నముద్దు— 42

ప్రతిఫలం— 44

విజ్ఞానవీథులు— 47

సినిమా— 49


నిష్పక్షపాతంగా ఆలోచిస్తే రాజమండ్రీలాంటి వూరులేదు. గంగానదికి అప్పగారైన గోదావరిలో పుట్టుకనుంచీ చరిత్ర ప్రవహిస్తూంది. కనపడవు గాని కోటిలింగాలు కలిగి దక్షిణకాశి అనిపించుకుంది. కోటిలింగాలదగ్గర కనపడేది ఇప్పుడు ఒక్కటే - ఒకరు చెప్పినట్లు - బొబ్బర్లంక వరకూ గొట్టం కనపడే పేపరుమిల్లు. కాని ఆ గొట్టంలోంచి గుప్పెడు పొగైనా ఇంత వరకు పైకిరాలేదుట. మనదేశంలో చెప్పుకో

ఐ పో లా

వలసిన రైలు వంతెనల్లో ఒకటి రాజమండ్రీలో వుంది. రాజరాజనరేంద్రుని కోటగుమ్మం సరిగా ఇప్పటి బజారు మొగలో వుంది; కోటగుమ్మంలేదు కాని ఆ స్థలం వుంది. రాజరాజనరేంద్రుడు, నన్నయార్యుడు సాయంత్రం లంక కోటాకు చుట్టలు వెలిగించి వాహ్యాళికి వెళ్లిన గోదావరిగట్టు ఇప్పటికీ వుంది.

తెలవారేటప్పటికి అప్పుడు తోటలో కోసిన నవనవలాడే వంకాయలు, గోంగూర, వీధుల్లోకి గడపదగ్గరికి వస్తాయి. యిక్కడ దొరకని కూరలు, పళ్ళు, తదితర వస్తువులు ఎక్కడా దొరకవు. రాజమండ్రి ఆంధ్రదేశానికి ఒకప్పుడు రాజధాని, రాజకీయంగాను చారిత్రకంగానూ. నేడు కళలకీ కవితకీ సంస్కృతికీ రాజధాని. కళలకు పుట్టినిల్లు రాజమండ్రి. శ్రీనాధుడు వేసుకునే శృంగార తాంబూలము ఇప్పటికీ బజారులో దొరుకుతుంది!

ఇటువంటి పట్టణమంటే కోపమెందుకో అనిపించుతుంది. నా అనుభవాన్ని గురించి చెప్తాను. ఒకసారి తప్పనిసరిగా రాజమండ్రీ వెళ్ళవలసివచ్చి రైల్లో పడ్డాను. ఇష్టంలేని ప్రయాణం కనుక ఒకమూల ఎవరితో మాట్లాడకుండా పత్రిక చదువుకుంటూ కూర్చున్నాను. నాపక్క అతను తనపక్క అతనితో ఏదో కాలక్షేపంకోసమన్నట్లు 'ఏ వూరు మనదీ' అన్నాడు. దానికి జవాబు వచ్చిన తక్షణం "ఏవూరు వెళ్లాలి" అన్నాడు. 'రాజమండ్రీ' అని సమాధానం వచ్చింది.

'ఎక్కడ దిగుతావు. గోదావరిలో నా వూళ్లోనా' అని మూడో ప్రశ్న. ఈప్రశ్న విని నేను ఉలిక్కిపడ్డాను. కొత్తగా రాజమండ్రీ వెళ్లేవాడికి ఇదొక అవస్థ.

సరే, రాజమండ్రిలో దిగాను. బజారుకి వెళ్లాలి. మార్కెట్ దాకా వచ్చాను. అడ్డంగా అరటి గెలలు వేసుకొని రెండెడ్ల బండి వస్తూంది. ఇటుపక్కనుంచి బండికెదురుగా సైకిలు ఒకటి బ్రేకులు పని చేయని దనుకుంటాను—వచ్చేస్తోంది. ఎదురుగా ఒక మనిషి నా ముఖాని కెదురుగా ముఖం వుంచి నించున్నాడు, ఎవరు వాడుగో తెలుసుకోడానికన్నట్లు. ఎల్లాగా నడవడం? కొంచెం వెనక్కి తప్పుకుందామనుకుంటూంటే, ఆబోతొకటి వ్యక్తిగౌరవాన్ని లెక్కించక వెనకనుంచి వచ్చి తన పొట్టతోటి రెండెడ్లబండిమైపు గెంటింది నన్ను. ఇంతలో పోలీసు కానిస్టేబులు నన్నివతలకు లాగి "ఏం భూమ్మీద విరక్తి పుట్టిందా?" అని అడిగాడు.

అప్పటినుంచే బజారు మొదలౌతుంది. భూమి ఈనినట్లుంటుంది బజా రెప్పుడూ. అక్కడ నడవడం అతికష్టం. మా మిత్రుడొకడు వాదించినట్లు నడిచే మనిషికికూడా గంట అవసరం. నా వుద్దేశంలో ఆ బజారులో అసలు మనిషి నడవడు. రాజమండ్రీ ప్రజల పరోపకారబుద్ధికీ సౌజన్యానికీ ఇదొక నిదర్శనం. బజారులో మనిషికి నడవవలసిన అవసరంలేదు. మనిషిని తోసేస్తారు. 'నడిచాను' 'వెళ్ళాను' అనడానికి బదులు 'తోపుడయాను' అనడం సవ్యంగా వుంటుంది.

ఆ బజారులో వర్షం పడితే ఒక అరగజం మందాన్న బురద తయారవుతుంది. సూర్యకిరణానికి తావివ్వనంత సన్నం కావడంచేత ఆ బజారులో వర్షంమూలంగా తయారయిన బురద ఎండడం అంటూ వుండకూడదు;

కాని మొన్నాటికి పొడిగా వుంటుంది! ఆశ్చర్యంగా వుండచ్చు. కాని ఆ బజారులో నడిచే జనాభా తమ జోళ్ళకీ కాళ్ళకీ కొద్ది కొద్దిగా బురద అంటించుకొని తమతమ నెలవులకి తీసుకుపోవడం కారణంగా ఎప్పుడూ పొడిగా వుంటుంది. బజారులో ఒక సైకిలు రెండో సైకిలులోకి వెళ్లిపోయినా కాని, పై మనుషులు క్రింద పడరు; క్రింద అన్నది లేకుండా జనం నడుస్తూంటారు కనుక.

ఆ వూరు ఈతిబాధలు రెండు. బజారు చేరుకునేవరకూ 'బాబయ్యా బజారుకి బండి కట్టుతాను' అంటూనే వుంటాడు బండివాడు. మా మిత్రుడొకడు చెప్పాడు - బండివాడు "బాబయ్యా బండికట్టుతానంటే జాగ్రత్తగా మాట్లాడు. కావలిస్తే నీకు కట్టుకో, నీ తాతకి కట్టుకో అంతేకాని నాకు బండి కట్టుతానంటావేమిటి? అన్నాడట ఒకడు. బండివాడు విస్తుపోయి వెళ్లిపోయాడట." రెండో ఈతిబాధ జోళ్ళవాళ్ళు. ముష్టివాళ్ళకంటే ఎక్కువ బాధ పెట్టేస్తారు. జోళ్ళులేని వాడిని కూడా 'బాబయ్యా నాడాలు కొట్టుతా'నంటాడు. కొత్తజోడు ఆ రోజునే కొని వేసుకున్నా సరే "బాబూ జోడు బాగుచేస్తాను. మీకు తోచింది ఇవ్వండి" అంటాడు.

నామిత్రుడు మూర్తి రాజమండ్రిలో ప్లీడరుగావుంటున్నాడు. సెలవులముందు అకస్మాత్తుగాపిడుగులాంటి వుత్తరంపడేశాడు నాకు. నేను తనతో లోగడ వాక్రుచ్చిన ప్రకారం సెలవులు పదిరోజులూ రాజమండ్రిలో గడిపి తీరవలెననీ, అట్లు గడపనిపక్షంలో తాను తన కార్యసిద్ధి కనుకూలమైన సత్యాగ్రహపద్ధతి నవలంబించ నిశ్చయించినట్లూ, నేను వచ్చేది రానిదీ తిరుగు టపాలో తెలియచేయవలెనని వ్రాశాడు. తన సత్యాగ్రహం ఏరూపం దాల్చుతుందో కూడా ముందే సూచనలిచ్చాడు. మళ్లీ నేను అతనిని కలుసుకునేవరకూ తను కాఫీ మానేస్తాడుట. అంటే మేము కాలేజీలో చదువుకునే రోజుల్లో రోజూ సాయంత్రం కాఫీ హౌసులో కూర్చుని కాఫీ పందాలు వేసుకుని మూడు నాలుగు కప్పులు త్రాగేవాళ్లం. అదొక దుర్వ్యసనంగా కూడా పరిణమించింది. రోజూ పది పన్నెండు కప్పులు త్రాగుతేనే కాని చురుకుగా మనిషిలా బ్రతకడం కష్టమైపోయింది. మే మిద్దరం ఎప్పుడు ఎక్కడ కలుసుకున్నా మా కాళ్లు వాటంతటవే కాఫీ దేవాలయంవైపు దారి తీస్తాయి. అందుచేత కాఫీ మానేయడమన్నది కఠోరదీక్షే. పైగా నిరశన వ్రతంలోకి వస్తుంది. అసంపూర్ణ నిరహార దీక్ష అన్నమాట. ఎందుచేతనో కాని నాకు సత్యాగ్రహమంటే భయం. నరాల్లోంచి కంపం పుట్టుకు వస్తుంది. స్వాతంత్ర్యం వచ్చాక కూడా ఇది ప్రజలలో మిగిలిపోవడం చాలా బాధగా వుంది. స్వాతంత్ర్యానికి ముందు ఏదో వుద్రేకంలో బాగానే వుండేది కాని తర్వాత కూడా, అందులోనూ గాంధీమహాత్ముడు సిద్ధిపొందాక, ఈ అస్త్రాలని ప్రయోగించుతూ మావంటి వాళ్ళను భయపెట్టుతూండడం ఏమంత బాగా లేదు. ఆ పరిస్థితులలో నేనేం చేశానంటే ఈ వుత్తరం అందనట్లూ అంతకు ముందే నేను సెలవుల్ని రాజమండ్రీలో గడపడానికి తన అంగీకారంమీద నిశ్చయించినట్లూ, అంతకు ముందు తేదీ వ్రాసి ఒక ఉత్తరం గీకి పారేశాను. మర్నాడు మళ్ళీ ఇంకో ఉత్తరం, అతని ఉత్తరం అందినట్లూ అందులోని సంగతులకు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ ఒక జాబు గీకేశాను. అంతటితో బెంగ వదిలింది. మూర్తి చాల సంతోషించాడు, అన్నప్రకారం రాజమండ్రీ వచ్చినందుకు. ఇంటికి వచ్చి, స్నానపానాదులు కానిచ్చుకొని కొంతసేపు పిచ్చాపాటీ చెప్పుకున్నాక నేను విశ్రమించాను. మూర్తి కచ్చేరి కెళ్ళి సాయంత్రం నాలుగ్గంటలకల్లా ఇంటికి వచ్చేశాడు. కాఫీ త్రాగి ముస్తాబయ్యాం వీధులలో పడటానికి. నేను పట్లాం, పొట్టిచేతుల బుష్ షర్టు వేశాను. అతనూ అంతేకాని పొడుగు చేతుల్ది వేశాడు. బయల్దేరుతుంటే అన్నాడు 'రిస్టువాచీ తీసి జేబులోనేనా వుంచు, ఇంట్లోనేనా వదిలేయి' అని. 'ఏం దొంగతనం జరుగుతుందంటావా' అన్నాను. 'ఆ భయం లేదులే' అన్నాడు. 'ఫాషన్ కాదు?' అన్నాను. 'అదీకాదు' అన్నాడు. 'చెప్తాను పదు' అన్నాడు.

వీధులోకి వచ్చాక అలా, గోదావరి గట్టుమీదనుంచి వెడదామన్నాను. 'ఈ వేళ ఏం వారం?' అన్నాడు. 'మంగళవారం' అన్నాను. 'ఇక్కడ కొన్ని ఈతిబాధలున్నాయి. అలా శాంతినివాస్‌లో ఒక కప్పు కాఫీ పోసుకొని కంభంవారి సత్రం సందులోంచి గట్టుమీద పడదామన్నాడు. అంతా అదోరకంగా వుంది. 'ఏం ఇక్కడ గట్టుమీద ముష్టివాళ్ళెక్కువా?' అని అడిగాను. 'ముష్టివాళ్లు సార్వకాలీనత, సార్వప్రదేశకత వున్న జాతి కనుక ఈతిబాధలలోకి రారు. పైగా వాళ్ల సంఖ్య రోజురోజుకీ పెరుగుతూంది. మళ్ళీ ఎన్నికలలో వాళ్ళు అధిక సంఖ్యాకులుగా తేలి, పరిపాలనాయంత్రాంగాన్ని తమచేతుల్లోకితీసుకునే అవకాశం వుంది కనుక వాళ్ళని ఏమీ అనడం మంచిదికాదు. నేను చెప్పేది చిన్న ఈతిబాధ. అక్కడ అడితీలు వున్నాయి, మనిషి కనపడితే చాలు "పుల్లలుకావాలా" అని ప్రతి దుకాణం వాడూ అడుగుతాడు. అనతిదూరంలోనే శ్మశానవాటిక వుండడంవల్ల, అక్కడ పనివున్న ప్రతివాడూ ఇక్కడే పుల్లలు కొనుక్కుపోతూండడంవల్ల, పుల్లలు అవసరమయితే తప్ప ఈ ప్రాంతంలో బ్రతకదలుచుకున్న వాడెవడూ గోదావరి గట్టు 'ఎక్కడు' అని చెప్పాడు.

శాంతినివాస్‌లో కాఫీ తాగుతూండగా రిస్టువాచీ సంగతేమిటన్నాను. 'ఏంలేదు! ఈ వూళ్లో ఎవరిచేతినైనా గడియారం కనపడితే అ/యిన వాడూ కాని వాడూ టైమడుగుతాడు. కొందరు అడిగి వెళ్ళిపోతూంటారు, వెనకాల వచ్చి చెప్పమన్నట్లు, ఆగి తెలుసుకునే టంత తీరుబడి లేనట్లూను. ఈ వూరిలో కొంచెం పరోపకార బుద్ధికల ఒకవ్యక్తి ఉన్నాడు. నేను పదకొండింటికి కోర్టుకి వెడుతుంటే మార్కెట్ దగ్గర ఇతను నిల్చుని టయిమ్ చెబుతున్నాడు ఎవరో అడుగుతేను. అల్లాగ అడుగుతూనే వున్నారు జనం, ఇతగాడు కదలకుండా చెబుతూనే వున్నాడు. నేను ఆరోజున ఆరింటివరకూ కోర్టులోనే వుండవలసి రావడంవలన అక్కడ హోటలులో ఇడ్లీకాఫీ పుచ్చుకొని సినీమా చూసుకుని రాత్రి తొమ్మిదిన్నరకు ఇంటికి వస్తూంటే ఈ వెర్రిబ్రాహ్మడు అదేస్థలంలో నుంచుని అలాగే టయిము చెబుతున్నాడు. అంటే పొద్దున్న మొదలు రాత్రివరకూ ఆ మనిషి గడియార స్థంభమయి పోయాడన్నమాట. అప్పటినుంచీ నేను కనపడినవాడితోటల్లా గడియారం కనపడనీయకని చెబుతూంటాను!" అన్నాడు. బ్రతికించావురా బాబూ అని వాచీని పంట్లాం వెనకజేబులో పడేశాను.

ఇద్దరం మెల్లిగా గోదావరి గట్టెక్కాము. అక్కడ బజారులో కంటె ఎక్కువ జనం వున్నారు. "ఏం జరిగిందేమిటి ఇంత మందున్నారు" అన్నాను. మూర్తి అన్నాడు "నిన్నిందాకా ఈవేళేరోజని అడిగాను కదూ! ప్రతి మంగళవారం సాయంత్రం ఈ గట్టు ఇలాగే వుంటుంది. ఈ గట్టు-చివర కిందకి ఆంజనేయస్వామి ఆలయం వుంది.

# “రాజమండ్రీ వెళ్ళబోకు రంగుబట్టా కట్టబోకు”

దానికి ప్రతి మంగళవారం స్త్రీలు నారికేళములతో స్వామివారి దర్శనానికి గట్టుమీద నుంచి వెడతారు. అందుకని, విద్యార్థులు, శృంగార పురుషులు, పనిలేనివారూ, వృద్ధులూ ప్రత్యేకనిర్ణీతస్థలాలలో కూర్చోని వుంటారు. గోదావరిలోపడి ప్రాణాలువదిలేసిన జనం అంతా మంగళవారాలు పడినవారే. చరిత్ర తిరగేస్తే నీకే తెలుస్తుంది.” అతని స్నేహితుల్ని కొందరిని పరియంచేశాడు. సరదాగా కాలం గడిపేశాం. గోదావరి గట్టుమీద దుమ్ములేకపోతే సాయంత్రాలు చాలా హాయిగా గడపవచ్చు.

రెండురోజులు గడిపాక అలా సినిమాకు పోదామన్నాడు మూర్తి. ఏదో అరవచిత్రం ఇప్పుడు ఆడుతూంది. అరవసినిమా నేను చూడను. ఇదివరకు ఒక అరవ సోదరుని కోరిక మన్నించటానికి అరవ చిత్రం ఒకటి చూచాను. ఎప్పటికీ పూర్తి కాలేదు. ఆఖరుకి లైట్లు వెలిగాయి. ‘అమ్మయ్యా’ అనుకుంటూంటే ఇంటర్వల్ అన్నాడు. పై ప్రాణాలు పైకే పోయాయి. సంత జనం సాధారణంగా పని చూసుకొని రెండో ఆట అరవ సినిమాకి పందుంపుల్ల పుచ్చుకుని పోతారుట. “ఆట పూర్తయేటప్పటికి తెల్లవారుతుందని నీకు తెలియదా! మూర్తీ! నాకు సినీమాపిచ్చి లేదు. తప్పదంటే ఇంక దేనికేనా వెడదాం కాని దీనికి వద్దు” అన్నాను.

“విమర్శ ముందు, తర్వాత నువ్వు పుట్టాలోయ్! నీకు అరవ చిత్రాలయందుగల అభిమానం ఇదివర కొకసారి చెప్పావు కాని ఇప్పుడు వెళ్లడం వుద్దేశం అది కాదు. ఈ థియేటర్ లో అరవ చిత్రం చూద్దామని అన్నాడు. ‘ఏమిటి విశేషం’ అన్నాను. ‘తినబోతూ రుచెందుకూ’ అన్నాడు. ‘అయితే తప్పదన్నమాట’ అన్నాను. ‘నీవు హాలులో కూచోకుండానే తలనొప్పి అంటావు ఇష్టం లేకపోతేను. పద ముందు కాఫీ సేవించివద్దాం’ అని లాక్కుపోయాడు.

జనం తండోప తండాలుగా వస్తున్నారు. ఏమిటో విశేషం అర్థంకాలేదు. ‘ఇక్కడ అరవచిత్రాలు బాగా చెలామణి అవుతాయేమిటి’ అన్నాను.

‘మనింటిదగ్గర సినీమాలో అరవచిత్రం నడుస్తూందిగదా. ఎంతమంది చూస్తారో నీకే తెలుస్తుంది.’

‘ఈ చిత్రం ఏమైనా గొప్ప స్టంటు చిత్రమా’

‘అరవచిత్రాలలో ఎక్కువ వతక్కువలేం వుంటాయిలే’

నాకు ఏమిటో చాలా చిరాకుగావుంది. సినీమా బాగుండదంటాడు. అయినా విశేషం వుందంటాడు. ఎప్పుడు మొదలుపెట్టుతారా అని ఎదురుచూస్తున్నాను. చిట్టచివరకి నాయకుడో మరెవరో ఇంత ముడీవాడూ తెరమీద కూర్చొని తొడ చరిచి సరిగమపదనిసా అని పాట అందుకున్నాడు. హాలులో అంతా విసుక్కున్నారు. ఎప్పటికవుతుందీ పాట అనుకున్నారు. అరగంట తరువాత మనల్ని వదిలిపెట్టాడు. ఇంతలో తెరముందున్న అరెకరం మేరలో కూర్చున్న ముఖాలన్నీ ఒక్కమాటు గొల్లుమని నవ్వాయి. మూర్తి నాకేసి చూస్తున్నాడు ఏమిటో నా కర్థం కాలేదు. ‘ఏమిటది’ అన్నాను. ‘ఝుమ్మారావు’ అన్నాడు ‘అతడెవరు’ “తర్జుమా రావు ఈ హాలులో వచ్చే హిందీ, అరవ చిత్రాల సంభాషణలు తర్జుమాచేస్తాడు. ఇతడి తర్జుమా చాలా గొప్పగా వుంటుందని తర్జుమారావు అని పేరు పెట్టారు. క్లుప్తంగా వుండడానికి తలకొట్టేసి ఝుమారావు అనమన్నాడు. అతడి నోట్లోంచి ఏ మాట వచ్చినా హాలంతా దద్దరిల్లేటట్లు నవ్వుతా”రన్నాడు.

సినీమా నడుస్తూన్న నాలుగు గంటలూ హాలంతా ఒకటే నవ్వు. నాకు కొంత అరవం వచ్చు. దాని ఈ చప్పుడుకి ఈ భావం అని తెలుసుకునే భాషాజ్ఞానం వుంది నాకు. కాని ఆరోజున చిత్రం అరవదనీ తెలుసుకోలేకపోయాను, తర్జుమా చేస్తున్నది తెలుగులోకనీ తెలుసుకోలేకపోయాను.

ఎలాగో ఇంటర్వల్ వరకూ కూర్చుని ఇవతలపడ్డాం. ‘ఎలా వుంది’ అన్నాడు మూర్తి. ఏమంటాను!

తర్వాత దారిలో చెప్పుకొచ్చాడు; ఝుమారావు కథనం. ఇతని కంఠం గంభీరమైనదీ స్వచ్ఛమైనదీ. మంచి చమత్కారంగా మాట్లాడగలడు. ప్రత్యేకం ఇతని తర్జుమా వినడానికే జనం తండోపతండాలుగా వస్తుంటారు. ఒకసారి ఒక రోజున ఝుమారావు కనిపించడంలేదని వూరంతా పాక్కిపోయింది. వారం రోజులు మనిషి పత్తా తేలలేదు. పురజనులు శ్రాద్ధాల ఘాటులో బ్రహ్మాండమైన సభ జరిపి, ఎవరో దుండగీడులు అతనిని మాయంచేశారనీ, ప్రభుత్వం తగుదర్యాప్తు తక్షణం తీసుకొని, అతనిని వెతికి రాజమండ్రీకి అప్పగించాలనీ, అతడు రాజమండ్రియొక్క సొత్తనీ పలువురు పురప్రముఖులు ఘాటుగా వుపన్యసించారు. పై వూర్ల సినీమాలన్నీ గాలించారు. చివరకి నెల రోజుల తరువాత మరో జిల్లాలో ఒక వూరులో ఒక సినిమాహాలు యజమాని అతనిని వందలు చూపించి బలవంతాన తీసుకుపోయినట్లు తెలిసింది. తక్షణం రాజమండ్రీలోని ఈ హాలు యజమాని కోర్టులో ఇంజక్షను ఆర్డరు పుచ్చుకుని అతనిని మళ్ళీ రాజమండ్రీ రప్పించాడు. ఆ రోజున కొన్నివేలమంది ‘ఝుమారావుకీ జై’ అనే నినాదాలతో అతనికి ఘనమైన స్వాగతం ఇచ్చారు. అప్పటినుంచి అతనున్న హాలులో టిక్కట్టు దొరకడం కష్టం అయిపోయింది. ఇప్పుడు ఆంధ్రదేశంలో ఎక్కడ తెలుగేతర చిత్రం ప్రారంభించినా ఆరోజున ఆహాలులో కథ చెప్పడానికి ఖర్చులపైన వందరూపాయలిచ్చి ఝుమారావుని తీసుకుపోతూంటారు. పదిరోజుల ముందునుంచే ‘మొదటిరోజు ఝుమారావుగారిచే కథా’ అని చాటించుతూంటారు. మొదటిరోజున చాలాచోట్ల రెట్టింపు రేట్లుకూడా పెట్టడం మామూలయిపోయింది. కొంతమంది ప్రత్యేకం ఝుమారావు ఏవూరు వెడితే ఆవూరు వెళ్ళి కథ వినడంకూడా వుంది” అన్నాడు మూర్తి. మళ్లీ మొదలెట్టాడు.

‘చిత్రాలని చూడడానికే వస్తారు కాని వినడానికి వచ్చేవాళ్లెవరైనా చూశావా’ అన్నాడు. ఇదేమిటి! చిత్రాల మాట తెచ్చాడు మధ్యలో అనుకొని ‘లేదు.’ “అందుకనే నేను పేపర్లో వ్రాద్దామనుకుంటున్నాను. పంచవర్ష ప్రణాళికకి డబ్బు కావాలంటే చిత్రాలని ఆంధ్రదేశమంతా త్రిప్పి మాటింగులు పెట్టి టిక్కట్టులు పెట్టి ఝుమారావు తర్జుమాకూడా పెడితే రెండు పంచవర్ష ప్రణాళికలకు కావలసిన డబ్బు పోగవుతుంది.” 

నాటిక:

# శిల్పానికి చక్కిలిగింతలు

పాత్రలు:

గిరి:

రాధ:

[స్థలము: ఒక గది. వెనుక ఒక తలుపు ఉంటుంది. అది వంటగదిలోకి ఎడమవైపు వీధినుంచి లోపలకు ప్రవేశించే ద్వారం. కుడివైపు పడకగది. గదిలో సామాన్యుల యింట్లో ఉండే ఫర్నిచర్ - పడక కుర్చీ, చేతులులేని కుర్చీ, డ్రాయరు, కాళ్లు పెట్టుకునే చిన్న పీట...

మూడు అంకములకు మధ్య కాలము కొన్ని నెలలు ఉంటుంది. మూడుమార్లు రాధలో చాలా తేడా ఉంటుంది, మాటాడే తీరులో చీర కట్టుతీరులో కూడా. అవే తేడాలు చుట్టూ గుమ్మాలకు కట్టే తెరలు మొదలయినవాటిలో కూడా చూపించాలి.

గదిలో పడక కుర్చీలో ఒక వ్యక్తి కూర్చుని ఉంటాడు. కొత్త చదువుకున్న మనిషి. చక్కనైనవాడు. కొంచెం షోకు చేసుకునే వాడే. చెయ్యడం చిన్న ఉద్యోగమే అయినా అందులో తృప్తికోసం వెతుకుతాడు. అతని పేరు గిరి.]

గిరి: (కూని రాగం తీస్తూవుంటాడు. మధ్యలో ఆపి) రాధా...రాధా...

రా: (వంటయింటిలో నుంచి) వస్తున్నానండీ...

గిరి: రావాలి...అర్జంటుగా...

రాధ: (వచ్చేసింది)

గి: ఏం చేస్తున్నావు రాధా...

రా: అన్నం వారుస్తున్నా...

గి: అయిపోయిందా?

రా: ఎల్లా అయిపోతుందండీ...అర్జంటుగా రమ్మని పిలిచారు, అది అల్లాగే ఉంచేసి వచ్చా...

గి: చంపేశావు...దానిమాట పూర్తిగా మూసిరా...అది అడుగు మాడిపోయిందంటే మనకీ ఆదివారం పూటా పేగు మాడిపోతుంది...

రా: మరి అర్జంటు అన్నారు...

గి: దానికంటె అర్జంటుకాదులే ... అది కానిచ్చిరా...

రా: (వెళ్లిపోబోతుంది)

[illegible] విని వెను (చెవులో ఏదో చెప్పబోయి) ఇప్పుడుకాదులే అదయిన తర్వాతరా...

రా: (వెళ్లిపోతుంది)

గి: (సిగరెట్టు అంటిస్తాడు. పొగ ఊదుతూ కూని రాగం తీస్తూవుంటాడు)

రా: వచ్చానండీ...

గి: అయ్యో వచ్చారాండీ...ఇల్లా కూర్చోండి...

రా: అల్లా నన్ను మీరు 'అండి' అనకూడదండీ...

గి: (చిత్తయిపోయి) అల్లా కూర్చో రాధా...

రా: మీరు నన్ను పేరెట్టిపిలుస్తే అరిష్టమండీ...

గి: ఫరవాలేదులే యిన్నాళ్లనుంచి రాని అరిష్టం ఇప్పుడు ఊడిపడదు...

బాలకృష్ణ

రా: పోనీ అల్లాగే పిలవండి మీకు ఎల్లాగ ఇష్టమయితే అల్లాగే మరి...

గి: అల్లా ఆ పీట యిల్లా యీడ్చుకు కూర్చో...

రా: కూర్చున్నానండీ.

గి: కూర్చున్నారాండి?

రా: అదుగో మళ్ళీ మీరు....

గి: కూర్చున్నావా?...

రా: ఊ...

గి: కూర్చో...

రా: (కూర్చుని ఉంటుంది రాయిలా)

గి: ఊరికే కూర్చున్నావేం, ఏం మాటాడవ?

రా: కూర్చోమన్నారు, అందుకు కూర్చున్నా...

గి: ఊఁ...ఏమిటి విశేషాలు చెప్పు...

రా: నన్నేం చెప్పమంటారు? వంటయింట్లో సతమత మయ్యేదాన్ని...

గి: పోనీ నే చెప్తాను వింటావా?

రా: అమ్మోరామ! ఎప్పుడన్నా వినవన్నానుటండీ...

గి: అంతేకాని నీకు వినాలని లేదు... అన్నమాట...

రా: నాకుమాత్రం వినిలేకుండా కూర్చోవాలని లేకనా, యింకా కూర పొయ్యిమీద పెయ్యలేదని కాని...

గి: అయితే యింకా కూరవండలేదన్నమాట...

రా: అవ్వే లేదండీ...మీరు అన్నం వార్చి అర్జంటుగా రమ్మన్నారు వచ్చేశాను...

గి: బతికించావు యిప్పటికన్నా చెప్పావు...ఆ కూరేదో పొయ్యిమీద యెక్కించే...రా...

రా: (లేచి వెళ్లిపోతుంది)

గి: (నిరాశగా సిగరెట్టుపీక గోడనుకేసి కొడ్తాడు ఇంకెందుకు యీ బ్రతుకు అన్నట్టు)

రా: (ప్రవేశించి) వచ్చానండీ...

గి: అల్లా కూర్చో రాధా...

రా: కూర్చున్నానండీ...

గి: ఇందాక రహస్యం చెప్తానన్నా దాన్నిగురించి అడగలేదేం? వినాలని లేదూ...?

రా: వినాలని ఉంటే మాత్రం అడిగెయ్యడమేటండీ...అది నే వినదలిసింది అవుతే మీరే చెప్తారని...

గి: అదికాదు రాధా...నీకు కొన్ని విషయాలు చెప్పాలి...

రా: చెప్పండి వింటాను...

గి: వింటానంటే కాదు అవి ఆచరించాలి...

రా: మీరు చెప్పినపని ఏదయినా చెయ్యనన్నానా?

గి: అనలేదు...అందులోనే ఉంది తంటా...

రా: చెప్పండి మీరేది చెయ్యమంటే అదిచేస్తాను....

గి: నువ్వు అల్లాగే చెయ్యవద్దు అంటాను...

రా: అవుతే చెయ్యనులెండి....

గి: రాధా రోజూ నువ్వు యిల్లాగే పని చేస్తూ ఉంటే విసుగు అనిపించదూ...

రా: అదేమిటండీ అనిపిస్తే మాత్రం అపని చేసుకోకపోతే ఎవరొచ్చి చేస్తారండీ పని?...

గి: అది నిజమే. అయినా జీవి ఎప్పుడూ మార్పును కోరుకుంటాడు రాధా...

రా: ఊహుం...అల్లాగా...

# చలి పాటలు:

## సింగరాచార్య

**1**

పిల్లి అడుగులు పెట్టుకుంటూ
చల్లగా వచ్చింది
పొగమంచు.
కొంచె మటనట కూరుచుని హై
కోర్టు, హార్బరు, నగరమంతా
తేరి పారగ జూచి
మెల్లగ
లేచిపోయింది.

**2**

మంచు దుప్పటి
ముసుగు కప్పుకు
తోకచుక్కల
భోలు గుడ్లతో
చెవులు చిల్లులు
పడగకూస్తూ
కాటుకల చీకట్లు పరచిన
బాటలను పర్వేత్తుతున్నయ్
ఇనపదయ్యాలు!

**3**

పొగమంచు జిలుగు మే
ల్ముసుగులో పగడాల
రాగాల నిద్రాహా
రంగుకాంతులు తొణుక
ప్రత్యక్షమయ్యె మా
ర్గశిర ప్రభాత ది
వ్యక్రసన్నిధి వియ
చ్చరయో! ఉషశ్రీయె!

## శిల్పానికి చక్కిలిగింతలు

గి: అబ్బ నువ్వు నన్ను చంపేస్తున్నావు...

రా: ఇప్పుడు నేనేం చేశానండి... మీరేం చెయ్యమంటే అది చేస్తున్నా... వినమన్నారు వింటున్నా...

గి: నువ్వు నే చెప్పిందల్లా చేసెయ్యకూడదు...

రా: సరేలెండి...అన్నట్టు కూర యీపాటికి మాడుతూ ఉంటుంది...

గి: పొయ్యిమీద వేసివచ్చావా?

రా: అల్లా రమ్మన్నారు కదండీ...

గి: అపనేదో చూసుకురమ్మని అర్థం...

రా: ఆఁ పోపుపెట్టి కూర దింపాలి...

గి: అయితే వెళ్ళు యింకా యిల్లా కూర్చున్నావేం?

రా: మీరు రమ్మన్నారు కదా అని వచ్చాను యింకా వెళ్లమన లేదని కూర్చున్నానండీ...(అంటూ వెళ్లిపోతుంది)...

గి: (సిగరెట్టు ముట్టించుకుంటాడు)

రా: (ప్రవేశించి) వచ్చానండీ...

గి: కూర్చో...

రా: కూర్చున్నానండీ...

గి: ఈ విషయం ఈవాళ తేల్చుకో దలుచుకున్నా...

రా: తేల్చుకోండి...

గి: నువ్వు శిలవుకావు ఏ ఆలోచనలు లేకుండా ఉండేందుకు ... అసలు చెప్తున్నా ... నీకూ కొన్ని ఆలోచనలు ఉంటాయి...

రా: లేకపోతే పప్పులో ఉప్పుసరిగా ఎల్లా వెయ్యగలుగుతున్నానండీ...

గి: అబ్బే పప్పుదగ్గర మాటకాదు....

రా: అక్కడిది కాకపోతే ఎక్కడిదో చెప్పండి...

గి: నీకు కొన్ని ఆశలు ఉంటాయి...

రా: ఊ ...

గి: సమాధానం చెప్పరాదా...

రా: అవుతే ఉన్నాయండి...

గి: అవుతే ఉన్నాయండి కాదు...నేను ఈవిషయం తేల్చుకో దలచుకున్నా... ఉన్నాయా లేవా...

రా: ఉన్నాయండి...

గి: అవి తీరాలని నీకు వుంటుందా ఉండదా.

రా: ఉంటుంది...'

గి: అదిసరే... నే చెప్పిన ప్రతిదీ నువ్వు ఆలోచించకుండా చెయ్యకూడదు...

రా: సరేనండి...

గి: ఇప్పుడు ఏమాలోచించావని సరే నన్నావు?

రా: నన్నాలోచించ మన్నారు...ఆలోచిద్దామనకున్నాను...

గి: ఇది ఒకటి... మరి రెండో దాని దగ్గరకు వస్తున్నా నవ్వూ ఒక మనిషివి ...

రా: అవునండి...

గి: నువ్వూ స్వంతంగా ఆలోచిస్తావు... అందుచేత... కూర ఏం చేయమన్నారు అని నన్నడగవద్దు...నీకుతోచింది చెయ్యి.

రా: సరేనండి...

గి: తోచకపోతే మానెయ్యి...

రా: సరేనండి...

గి: నిన్ను ఎందుకు పిలిచానో తెల్సా...?

రా: ఏదో అర్జంటు పనిమీద

గి: అవును... ఇది అన్నిటి కంటే అర్జంటు...

రా: చెప్పండి చేస్తాను...

గి: అదే వద్దన్నాను... చెప్పండి అను; చేస్తాను అనవద్దు.

రా: సరేనండి...

గి: ఎందుకు చేస్తాను అనవద్దు అన్నాను?

రా: ఏమోనండి...

గి: నే చెప్పింది చెయ్యకూడనిది అవవచ్చు...అటువంటిది అవుతే చేస్తావా?

రా: మీరు అటువంటిది ఎందుకుచెప్తారు చెప్పరు నాకు తెల్సు...

గి: చెప్తానే అనుకో...

రా: అది నాక్షేమంకోరి చెప్పిఉంటారు తప్పకుండా చేస్తాను...

గి: అబ్బ అల్లాగే చెయ్యవద్దనేది...

రా: సరేనండి...

గి: ఇది మనయిద్దర్నీ సంతోషపెట్టే విషయం...

రా: అవుతేనాకూ సంతోషంగా ఉంటుందండి...

గి: ఇదిమనజీవిత సుఖసాధనకు ముఖ్యము జీవితంలో తుఫాను కావాలి... కష్టాలు కావాలి... లేకపోతే విసుగ్గా వుంటుంది...

రా: అవునండి విసుపుగా ఉంటుంది...

గి: జీవితంలో ఒడుదుడుకులు ఉండాలి. నువ్వు యిల్లా మన్నుతిన్న పాములా ఉంటే అందులో ఆనందం ఉండదు.



ఆంధ్రపత్రిక - సచిత్రవారపత్రిక

ఫొటో: ఎమ్. ఆదిశేషారెడ్డి—విడవలూర్.

నువ్వు అసమానూ అల్లా ఉదాసీనంగా ఉంటే చెక్కిన అజంతా శిల్పంలా ఉంటావు. నాకు అల్లా ఉంటే విసుపు ఒకప్పుడు నీముఖంలో ఆనందరేఖలు ఉండాలి ... మరొకప్పుడు నీముఖం కోపంతో రక్తపుష్పంలా ఉండాలి... మరొకప్పుడు, ఈర్ష్యతో ఇంకొకప్పుడుఅసూయతో.... ఇంకొకప్పుడు లాలించే మాతృమూర్తి ముఖంలా ఉండాలి......మాట్లాడ వేంరాధా...!

రా: మీరేదో మాట్లాడుతున్నారు కదండి...

గి: అవుతే...

రా: తిరువాత నన్ను మాట్లాడ మంటే నేను మాట్లాడుతాను...

గి: అబ్బబ్బా యింకనీతో నే బ్రతకలేను. రాధా నువ్వుయిల్లాఉంటే ఎల్లాచెప్పు? నీ ముఖంకూడా మారని ఆఫీసుపనిలా ఉంటే విసుపు ఎత్తదూ...?

రా: నన్నేం చెయ్యమంటారు?

గి: నీకు చెప్పలేను...

రా: చెప్పండి చేస్తాను...

గి: అబ్బా...

రా: ఏమండీ...?

గి: నీకొక నమస్కారం ఒక్కసారి లోపలికి వెళ్ళిపో...

రా: అల్లా భార్యకు నమస్కారం పెట్టడం తప్పు కదండీ... (వెళ్ళిపోతుంది)...

గి: అన్నట్టు రాధా...పడక కుర్చీలో కొయ్యన ఉన్న సంచీ యిల్లా తీసుకురా...

రా: (తీసుకువస్తుంది)

గి: ఇది నీకు సంక్రాంతి కానుక...

రా: అల్లాగాండి?

గి: ఇదేదో చూదామని లేదూ...?

రా: ఉందండీ...

గి: అవుతే అడగవేం?

రా: మీరే చెప్తారుకదా అని...

గి: చెప్పను...నువ్వు యింకా యిల్లానే ఉంటే తిరిగి యిచ్చేసి వస్తాను...

రా: పోనీలెండి ఇచ్చెయ్యండి... మరెందుకన్నా పనికివస్తుం దా డబ్బు...

గి: (సంచిలోంచి తీసి) ఇది నీకోసం చీర...ఎల్లాఉంది?

రా: బాగానే ఉందండి?

# ★ శిల్పానికి చక్కిలిగింతలు ★

గి: ఈ రంగు నచ్చదనే దానవుకా...?

రా: అయినా నే బహుశా కట్టుకుంటే బాగుంటానేమో అందుకే పట్టుకు వచ్చారు...

గి: నన్ను చంపేస్తువున్నావు రాధా... మరోకరకం తెమ్మంటావా? ఇందులో నాయిది ఏముంది చెప్పు...స్వంతంగా ఆలోచించు, కట్టుకు నేదానవు నువ్వు...

రా: బాగానే ఉంది ఇది ఉంచండీ...

గి: నీకు నిజంగా నచ్చిందా ?...నే తెచ్చా కదా అని నచ్చిందంటున్నావా?

రా: నిజంగానే నచ్చిందండీ...

గి: ఇంక బ్రతకలేను నీతోటి...ఎక్కడికన్నా పోతా...వంట అయిందా యింతకీ...

రా: చారు యింకా పెట్టలేదండీ... మీరు రమ్మన్నారు కదా అని వచ్చేశాను.

గి: అవుతే తొందరగా వెళ్లి తగులడు... ఖర్మ...ఖర్మ...

రా: స్నానం చెయ్యండి...ఈలోపులో అవుతుంది...

గి: నా యేడుపు నే ఏడుస్తాలే...నువ్వు పోయి అదిచూడు...

రా: వేణ్ణీళ్లు పెట్టమంటారా... చన్నీళ్లు పోసుకుంటారా?

గి: నే చెప్పడన్నా చన్నీళ్లు పోసుకున్నానా?

రా: అయినా అడగడం మంచిదని అడిగానండీ...

గి: వేణ్ణీళ్ళు పెట్టి ఏడవక్కరలే... ఆ చారూ తగలెయ్యక్కరలే...ఇల్లా గే పోతా ఈ యింట్లో తిండికూడా తినలేను..

రా: అదేమిటండీ...

గి: నా ఖర్మ...

రా: నేనేం తప్పుచేశానండీ...మీరు ఫోం చెయ్యక పోడం...నేనూ మానేస్తా... నాకు అర్థమయేట్టు చెప్పరు ఊ బాధపడ్తారు ...నేనేంచెయ్యను చెప్పండీ...

గి: నన్ను చంపెయ్యి...

రా: రామ రామ...

గి: వాడెవడు...నన్ను యిల్లా ఏడిపించి బయటకుపంపి వాణ్ణి తీసుకవద్దామనా యీ నాటకం ఈ నక్క వినయాలు నాదగ్గర సాగవు...

రా: ఆఁ...అవేం మాటలండీ...(ఏడుస్తుంది)

గి: ఏడవకు రాధా...ఇప్పుడు నే అన్న వన్నీ పిచ్చిఎక్కి అన్నాననుకో...నువ్వు నా మాటలు వింటూంటే నే భరించలేను... ఎదురుచెప్పాలి. అది నాక్కావలసింది...

రా: అదా...

గి: నువ్వూ రాగద్వేషాలు ఉన్న మనిషిలా ప్రవర్తించాలి...అదీ నాకు కావలసింది.

రా: అంతేనా...(నవ్వుతుంది...)

గి: అమ్మయ్య (బరువు దింపుకున్నట్టు అంటాడు) [తెర]

## 2

[రాధ అద్దం ముందుపెట్టుకుని బొట్టు సవరించుకుంటూ ఉంటుంది. గిరి ఆఫీసు నుంచి వచ్చి కోటు పడకగదిలో పెట్టి వస్తాడు...]

గి: ఈ క్రొత్త సింగారమేమిటి?

రా: క్రొత్తఫాషను కత్తిరింపు జట్టు...

గి: ఇదుగో యిల్లా చూడు...నువ్వు ఆక త్తిరింపుజుట్టు మామూలుగా పెంచేందుకు నన్నేం చెయ్యమంటావు?...

రా: అదేమిటండో యీ...ఇది మరీ బాగుంది నా జుట్టు నేదో చేసేందుకు మీకేం చెయ్యాలి?

గి: అదీ రాణీగార్ని కలవమ్మంటున్నా ...నా కంటికి నువ్వా జుట్టుతో కనిపిస్తే అరికాలు మంట నెత్తికెక్కుతుంది...

రా: పాపం!...

గి: అంతేకాని అది మాననంటావు?

రా: అంటే...

గి: అంటే నేనింక నీతో బతకలేను...

రా: అదేమిటండి మీరు నాకోసం బ్రతుకుతున్నారా?

గి: నీకోసం కాదు నీతోనని నే సహోరించేది.

రా: అంతేనా...

గి: అంత తేలిగ్గా కనపడుతోందన్న మాట...

రా: ఏమిటి?

గి: ఏమిటో తెలియకుండా నే మాట్లాడుతన్నా వన్నమాట...

రా: అన్నమాట...

గి: నా కింక వళ్లు మండుతోంది.

రా: మీరు యిల్లా పోరు పెడ్తూఉంటే నాకూ మండుతోంది...

గి: లోతుగా చూసుకుదిగు

రా: ఆ మాటే నేనూ అనవచ్చుగా...

గి: అంటావు అనవూ అన్నింటికీ నీకు లోకువ యిచ్చుకుని నువ్వు చెప్పినమాటల్లా వినబట్టేనా?

రా: వింటే ఏం చెడ్డారేం?

గి: అంతా చెడ్డాను. చచ్చేట్టు పగలస్తమానూ ఆఫీసులో ఏడ్చినా మా ఆవిడ పోడగ్లకూ పోల్నలకూ చాలట్లేదు.

రా: చాల్లెండి మీ జీతమంతా నాపోల్నలకే అవుతోంది మీ సిగరెట్లమాట....

గి: చావనా సిగరెట్లు కాల్చక సినిమాలకి వెళ్ళక... ఏదో ఓలా యీబాధ మర్చిపోవాలా ఇంటికొస్తే కాస్తైనా సుఖం ఏడుస్తేగా...

రా: మహాకష్టపడి పోతున్నారు. ఏం ఇంటికొచ్చి శుభ్రంగా మీపనేదో చూసుకుని కాస్త సరసంగా మాట్లాడ కూడదూ?

గి: ఆఁ మరే సరసంగా మాట్లాడక నే నే మహావిరసంగా మాట్లాతూ ఉంట....

రా: అదే చెప్పేది. ఇంటికి వచ్చేసరికి మీరు ప్రపంచంలో మునిగిపోయే వ్యవహారాలన్నీ మర్చిపోతారు... ఇంక పనేముంది కాళ్ళు చాచుకుని తీరిగ్గా కూర్చుని అదుగో చీర అల్లాకట్టావు...

గి: ఆ చీరాతీరూ నాకు కాకపోతే ఎవడికి కావాలి చెప్పు...

రా: ఆఁ ఇంక చాల్లెండి...నాచీరతీరు ఎవడికోకూడా కావలసి రావాలి...అనాచకం మాటలు మీరూను...

గి: అదుగో...

రా: మాట అంటే మాటవస్తుంది. ఇంటికొచ్చి నాజుట్టు చూసి యిల్లా రుసరుసలాడ్తారు. మీ ఆఫీసులో గానువాటంఉన్న టైపిస్టునుచూస్తే గుసగుసలాడ బుద్ధేస్తుంది.

గి: అమ్మయ్య బతికించావు... ఆ దానీ ఏడుపు...

రా: అవును ఏడుస్తే మరి. మొగాడు పరాయిదాన్తో...

గి: అదికాదే మరిఅసలు విను...

రా: ఇప్పుడు వినకేం చేశానేం ?...

గి: ఏదో చేశావని కాదు. అదిమాకావు అది ఆంగ్లోయిండియను ... ఎర్రగా ఉంటుంది...

రా: అందుకే నంటారు అదంటే అంత మోజు.

గి: అబ్బ మోజుగోడెవ కాదే అసలు విషయం చెప్తున్నా...

రా: ఆ చెప్పక్కర్లె తొందరగా వెళ్ళి ఊరేగండి...

గి: అందుకే ముందే చెప్తున్నా వినమని...

రా: మీరు చెప్పాకర్లేనే వినాక్కరలే..

గి: అదేమరి... ఏం... అది ఎర్రగా వుంటుంది. అది మాట్లాడే యింగ్లీషుకీ దాని నడకకీ తొడిగగౌనుకీ కత్తిరింపు జుట్టుకీ సరిపోతుంది. అదెవత్తో పోలమ్మకుందని నువ్వూ పెట్టుకుంటే ఏల్లాగ చెప్పుమరి?...

రా: ఆఁమరే......నాకూ యిదే బావుంటుంది. మీకు ఏది యిష్టమయితే అది చెయ్యడం నా బాధ్యత. ఆమాత్రం నాకు తెలియదనుకున్నారా ఏం?

గి: నాకది యిష్టమని ఎల్లా తెలిసింది మహాతల్లీ అని తమ సమాధానంకోసం మొరకరించి దేవురిస్తున్నా...

రా: ఇందులో అంత మోకరించి దేవురించవలసింది ఏమీ లేదండోయ్...

గి: మ రేముందో తెలుస్తే యీవాల్టికి బ్రతికి బయటపడ్డా.

రా: ఎల్లాగయినా యింక కుదరదు... నేనిల్లా ఉండవలసిందే. ఇంక యీవాళ బజారుకు వెళ్ళి రెండు మూడు గౌన్లుకూడా మీరు కొనితేవాల్సిందే.

గి: అయ్యబాబోయ్...ఇంక నీతో నే బ్రతకలేను. ఆ గౌను వేసుకుంటే అమ్మవారులా ఉంటావే...నా మాట వినవూ. అది మానెయ్యవూ?

రా: ఇంక మానెయ్యడ మన్నది కలలో మాటండోయ్...కుదరదు...

గి: అవుతే ఇంక ఈవాళ్లే ఈ ఇల్లు ఖాళీ చేస్తున్నా తమరు రేపు ప్రొద్దుటే పుట్టింటి దారి పుచ్చుకోండి...

రా: ఏం దొరగారు దొరసానిగార్ని తెస్తారా?

గి: ఇదుగో యిందాక అంటే ధలోక్తి అని ఊరుకున్నా జాగర్త యింక అటువంటి మాటలు రానియ్యకు...

రా: అవునులెండి ఉన్నది గట్టిగా అంటే పాపం మీకు కోపం వస్తుంది...

గి: ఏమిటంటావు ఉన్నది?

రా: తెలుస్తూనే ఉంది.

గి: ఏమిటి?

రా: అదే...ఆ దొరసానిగారిని ప్రేమిస్తున్నారా ఏం తేల్చి చెప్పెయ్యరాదూ.... యిల్లా నాన్చి చంపకపోతే.

గి: ఇన్నాళ్లు ఉండి యిదేం అగావు లేస్తున్నావే?

రా: అగావులేం ఎదురుగా కళ్లతో చూస్తేను.

గి: ఎవడా చూసినవాడు చెప్పు తలబద్దలు కొడ్తాను వెధవని...

రా: ఒకళ్ళు చెప్పడమేం నాకే ఉన్నాయి బండి చక్రాలంత కళ్లు... నేనే వస్తీదాన్నవుతే మీరు యిల్లా చేస్తురా...

[ఏడుపు]

గి: ఇది మరీ వరసగా ఉంది. నన్ను విడిపిస్తూ ఎదురు నువ్వేడుస్తా వెంగుకే?...

రా: ఏడుపు కాక మరేమిటండీ...మీకు అది యిష్టం అవుతే నాతో చెప్పరాదూ... నేనూ గౌను తొడుక్కుందును కదా. ఈ పౌడరూ నా శ్రాద్ధం మీకు యిష్టమనికదూ రాసుకుంటూ ఉంట.

గి: నా కిష్టమనా నన్ను చంపి తెప్పించి అంగుళం మందం కోటా వేస్తూంట?

రా: కాకపోతే సంసారి కీఅలంకారాలన్నీ ఎందుకండీ?

గి: బాగానే ఉంది. నాకు అవంటే ఒళ్లుమంట మరి...

రా: ఇల్లాగే నన్ను మొదణ్ణించీ మోసం చేస్తూవుంట. పౌడరూ అవీ ఒళ్ళుమంట అన్నారు అప్పుడు. ఇప్పుడు ఈ కత్తిరింపు జుట్టు అసహ్యం అంటున్నారు.

గి: నా కసహ్యం కాదని ఎల్లా తెలిసింది...

రా: ఇంక వేరే తెలియాలేం?

గి. అబ్బ నన్ను చంపక ఏం జరిగిందో సూటిగా చెప్పు...

రా: ఇందులో చంపడమేముందీ...

గి: అదుగో అటువంటి అతుకుమాటలే అనకు. తిన్నగా చెప్పు. ఇద్దరం ఎన్ని అనుకున్నా నాకు నువ్వు నీకు నేను అంతే కాని మరొకళ్ళవరు కదా. ఇన్నాళ్ళనుంచి కాపురం చేస్తున్నామా చనువేనా మరి. సూటిగా చెప్పు.

రా: ఇన్నాళ్ళు నాకు మీరు మీకు నేను అనుకున్నా కాని యిప్పుడు అభిప్రాయం మార్చుకుంటున్నా...

గి: అదుగో మళ్ళీ...

రా: మీకు యిష్టమని కనిపెటి కాకపోతే కొత్తగా యివన్నీ ఎందుకు నా మొహానికి...

గి: నాకవి యిష్టంలేవు సరా

రా: అల్లా అంటే సరా మరి. ఎదురుగా దృష్టాంతాలు కనపడ్తూఉంటే...

గి: అవేవో తొందరగా చెప్తే...యీ అలక తీరే సినిమాకి పోదాం...

రా: మీరు ప్రక్కవాటాలో చదువుకుంటున్న అమ్మాయితో తెగ లొలికేలా మాట్లాడేవారు. ఆ అమ్మాయి స్నో పౌడరు రాసుకునేది. అందుకు నేను కూడా అవి రాసుకుంటే నాతోకూడా అల్లా మాట్లాడుతారుకదా...అని మీకు యిష్టమేమో అని...రాసుకుంటున్నా...

గి: చంపేవు...మరి ఈ కత్తిరింపుజుట్టు ఇష్టమని ఎల్లా కనిపెట్టావు?

రా: నిన్న స్నేహితులు రమ్మన్నారని సినిమాకి వెళ్ళారు మీరు. ప్రక్కయింటి వాళ్ల బలవంతంవల్ల నేనూ ఆ సినిమాకే వచ్చాను. మీ ప్రక్క ఆ గౌను పిల్ల ఉంది. మీరు బహు హుషారుగా ఉన్నారు. గౌనూ కత్తిరింపు జుట్టూ యిష్టమని అల్లా కనిపెట్టాను...

గి: వెర్రిదానా......ఇంక ఇటువంటి అపోహలుపడి నన్ను చంపకు మరి. పలకరించిన ఆడదాన్తో కస్సు బుస్సుమంటూ మాట్లాడ్తారా? ఆఅందుకు చదువుకున్న అమ్మాయితో మాట్లాడాను. నిన్న ఆఫీసు అంతా కట్టకట్టుకుని సినిమాకి వెళ్లాం ఎవడికో బదిలీ అవుతే ... నా ఖర్మవశాత్తూ అది నా ప్రక్కన కూర్చుంది సరా...

రా: అంతేనే...

గి: అంతేనే బాబూ...రైటో...నీ అపోహకి శిక్ష అన్నమాట ఆ జుట్టు కత్తిరింపు. భగవంతుడా ఎల్లాగరా అది ఎదిగే దాకా దీనితో కాపురం...దాన్నే ఎలాగో అల్లి ముడేసి తగలెయ్యి...

రా: అదుగో అల్లాగే మాట్లాడవద్దన్నా.. తగలెయ్యట తగలెయ్యి...

గి: పొరపాటు రాణీగారూ పొరపాటు ...ప్రేయసీ దానిని ఏదో విధముగా అల్లి నాలుగు పువ్వులు పెట్టుకొనుము. మన మిరువురము ఆనందసుధావాహినిలో తేలుచూ మేటనీకి పోవుదము...

రా: ఆ వాహినిలో పడవ అక్కర లేదా?

గి: రిక్షాలు లాగేస్తాయిలే...

[తెర]

## 3

[రాధ కుట్టుకుంటూ ఉంటుంది. గిరి కూర్చుని - ఒకమారు టైమ్ చూసుకుని...]

గి: రాధా మరి టీ వేళయింది. కొంచెం గొంతుకలో వేడినీళ్లు పోస్తివా ధన్యుణ్ణి అవుతాను...

రా: బలేవారే అది మీరు నాకు జ్ఞాపకం చెయ్యాలా? నాకు మాత్రం అవలా మరి...

గి: మరి?...

రా: కొద్దిగా ఉండండీ...ఇది కొంచెం కుట్టేసి...

గి: ఈలోపులో నా ప్రాణం హరీ అంటుంది...

రా: పీడొదిలిపోతుంది...

గి: అదేమిటి రాధా అల్లా అంటావు? నే పీడలా కనపడుతున్నానా?

రా: అవును.

గి: నిజంగా అల్లా అనుకునే అల్లా అంటున్నావా?

రా: ఏమండోయ్ నాకు ఒకటి అనుకోవడం ఒకటి చెప్పడం యిటువంటివి చేతకాదండోయ్...

గి: నే పీడలా కనపడుతన్నా నన్న మాట...

రా: కాదుటండీ మరి...ఏదో చేతులో పని ఉందా?...చూస్తున్నారా?...

గి: మరి టీ వేళయింది రాధా...

రా: అది నాకు తెలియదనేగా మీరనేది...?

గి: అబ్బే నీకు తెలియదని ఎల్లాఅంటాను నీకు తెల్సు...

రా: మరి?

గి: ఏదో పనిలో మునిగిపోయావని కొద్దిగా గుర్తుచేశాను...

రా: గొప్పపని చేశారు...

# ★ శిల్పానికి చక్కిలిగింతలు ★

గి: అల్లా యిది చేస్తే ఎల్లాగ చెప్పు శాస్త్రానికి శూస్త్ర దీనికీని...

రా: మరి యిది చెయ్యకపోతే ఎది చెయ్యమంటారేం? చేస్తున్న పని చూడక్కరలా?

గి: చూడాలే అనుకో...

రా: మరెందుకు చూడలేదు?

గి: ఇదుగో.. ఇల్లా చూడు రాధా. యిన్నాళ్లు యిల్లా ఉండేదానవా? ఇల్లా? శాస్త్రకీ శూస్త్రకీ మండిపడితే ఎల్లాగ చెప్పు?

రా: శాస్త్రా శూస్త్రా ఏం కాదు. చాలా పెద్దపనే చేశారు చూడండి యిక్కడ అల్లిక ఎల్లా తగులడిందో...

గి: ఇల్లాతే మరి. ఇంక యిదవకు. నువ్వు వెళ్ళి ఆ టీపని చూడు. నేను ఈలోపులో, యీ అల్లిక చూశావూ- యిప్పి ఉండచుట్టి చక్కగా అట్టే పెడ్తాను.

రా: కష్టపడ్తారు. మీకు అల్లిక వచ్చునా ఏమన్నానా? సన్నటిదారం తెగిపోయిందంటే కొంప మునుగుతుంది.

గి: అదేమిటి రాధా...ఆమాత్రం చెయ్య లేనూ? పోనీ చెయ్యలేనే అనుకో...ఇప్పుడంత మునిగిపోయే పనా యిది? రేపు అల్లుకోకూడదూ?

రా: అదేం కుదరదండోయ్...రేపు అనేది యీవాళే చేసే తత్వం నాది. ఇల్లా యీ కబుర్లు చెప్పకపోతే కొంచెంసేపు ఆగరాదూ?

గి: రాధా యీవాళ ఆదివారమూ మరి...

రా: ఖర్మ అదికూడా జ్ఞాపకం లేకపోవాలి...

గి: అహా నీకు జ్ఞాపకం లేదనా ఊరికే చెప్తున్నా...మనం యిల్లా కీచులాడుకుంటూంటే ఎల్లాగ చెప్పు...

రా: చాల్లెండి నేనే కీచులాడేదాన్ని. మీరు ఏమీ ఎరుగని నంగనాచి...

గి: నేను నీది తప్పంటున్నానా?

రా: అల్లా ముఖంమీద అనలేదు అంతే..

గి: రెండు చేతులు కలిస్తే కాని చప్పట రాదు అంటున్నా...

రా: మీ చెయ్యి కలపకండి...

గి: అదేగా నేను యిందాకణ్ణుంచీ ప్రయత్నించేది...

రా: అల్లాగా పాపం...గిల్లికజ్జా పెడ్తాను. బలేవారండి ఎంత సూక్ష్మంగా తప్పుకుంటున్నారండీ...

గి: అబ్బే అటువంటిదేం లేండే. నువ్వు నన్ను అంటున్నావు కాని నేను నిన్ను పల్లెత్తుమాట అన్నానూ?

రా: అన్లేదు. మరిమీకు అసలు నోటిలో నాలిక ఉంటేగా అనేందుకు. నేనే మిమ్మల్ని అనేస్తున్నాను. మీరు పాపం మంచివారు కనుక పడి ఊరుకుంటున్నారు.

గి: అబ్బ నన్ను చంపెయ్యకు రాధా. ఇందాకా మనం అనుకున్నదంతా మర్చిపోదాం.

రా: నేనేం అంత మహాపాపం చెయ్యలేదండోయ్ మర్చిపోదాం అనుకుని పాపం కాశీలో వదిలేశే ముఖం పెట్టేందుకు...

గి: నీతో ఏదన్నా తంటగా నేఉంది.

రా: తంటా కాదూ మరి. నన్ను మీరు చేసుకోవడమే పెద్దతంటా...

గి: అవును అల్లాగే కనిపిస్తోంది...

రా: అన్నారూ అంత మాటాను. ఇంక మన యిద్దరికీ ఎందుకు యీతంటా...ఇంక మనం విడాకులు పుచ్చుకుందాం...నా మాట వినండి. మీకు యింక నాతో సంసారం ముఖం మొత్తింది...ఏ పల్లెటూరి గబ్బిలాయినో......పెళ్ళి చేసుకోండి హాయిగా...

గి: రాధా...

రా: మొగాడికేమిటి మహారాజు వెయ్యి పెళ్ళిళ్లన్నా చేసుకోవచ్చు...

గి: రాధా నన్ను వేపుకు తినకు...

రా: ఎదురుపట్టించండి...వేపుకు తింటున్నది నేను...

గి: భగవంతుడా...ఎవడి ముఖం చూశానో యీవాళ...రాధా టితో మొదలైనదాన్ని, విడాకులతోనయినా అంతం అవనిస్తావా?...

రా: మొదలు మీరే పెట్టారు...

గి: ఎవరు పెడ్తేనేం...టీ తొందరగా పెట్టు రాధా...అంటే నాకోసమా? మనం యిద్దరం సినిమాకు పోదామనికదూ?

రా: అల్లాగా పాపం...సినిమాకి పోదామని నేను రానండోయ్...

గి: రాడం రాకపోడం మళ్ళీ పెట్టకు ఆ టీనీళ్ళు ఏవో చూడు...

రా: చూస్తారు. మీరే చూడరూ...నే చూళ్లేనుసుమండీ...ఇంత సేపణ్ణుంచి వితండవాదం చేశారుకానీ వెళ్ళి ఆ ప్లగ్గు కాస్త తగిలించి స్టౌ మీద నీళ్లు పెట్టడమేకా ఆ పని చేశారూ?

గి: రాధా...

రా: ఏం మీ మర్యాద మంటకలిసి పోదులెండి యీ మాత్రానికి...

గి: రాధా...

రా: ఏమోనబ్బా...ఇప్పుడు లేచేందుకు నాకు వీలు లేదు. ఈ కుందేలు బొమ్మ అల్లిక పూర్తి చెయ్యాలి అప్పుడు వెళి పెట్టాలి....

గి: అది కాదు రాధా...

రా: అది కాకపోతే యిది అవునండి సార్...మీకు టీనీళ్లు పెట్టుకోడం నామోషీ అవుతే వెయిట్ చెయ్యడం...లేకపోతే పెట్టుకోడం...

గి: అల్లాగ చెప్తే ఎల్లాగ రాధా?

రా: అంటే పెడ్తానని చెప్పి ఆలశ్యం చెయ్యమంటారా?

గి: ఇదంతా నా ఖర్మ...

[లేచి వెళ్తూ...]

రా: అల్లా విసుక్కుంటూ అవుతే పెట్టక్కరలేదండోయ్. నే తాగను మీరే తాగండి...

గి: విసుక్కుంటూ వెళ్లడమేం... ఏడుస్తూ వెళ్తున్నా...

(లోపలకు వెళ్తాడు.)

(రాధ కిలకిలా నవ్వుతూ అల్లుకుంటూ ఉంటుంది)

(వంటయింటిలోంచి)

గి: రాధా...రాధా...

రా: (నవ్వుతూంటుంది కాని టోన్‌లో అది కనపడనివ్వదు) ఏమండీ చెముడనుకున్నారా ఏం? కొంచెం మెల్లిగా పిలవకూడదూ?

గి: అదుగో మళ్ళీ...

రా: ఆఁ...ఆఁ...అల్లా విసుక్కుంటే నే తాగనండోయ్...

గి: రాధా...

రా: ఆఁ...

గి: ఇల్లారా ఒక్కసారి...

రా: అబ్బే కుదరదు. చెవులపిల్లి చెవులు నులుముతున్నా...

గి: ఒక్కసారి మళ్ళీ వెళ్ళిపోదుగాని...

రా: అబ్బ ఊరికే అరవక చెప్దురూ?...

గి: రాధా...

రా: నాకు మీదయవల్ల చెవుడు ఇంకా రాలేదు. అక్కడనుంచి మాట్లాడితే ఇక్కడకు వినపడుతుంది అని చెప్తున్నా.

గి: నువ్వు ఎంత అంటే అంతేనా రాధా.

రా: అంతే...

గి: అయితే పోనీలే...

రా: పోనివ్వక?

గి: అహా దానికోసం కాదు. ఎన్ని నీళ్లు పొయ్యమంటావూ అని.

రా: మీకు ఒక గ్లాసుడు టీ చాలుగా.. రెండు కావాలా?

గి: నేనేం రాక్షసుణ్ణనుకున్నావా ఏం? ఒక గ్లాసు చాలు.

రా: అవుతే గ్లాసులో మూడొంతులు పొయ్యండి...మరి మిగతావి పాలు పడ్తాయి.

గి: మరి నీకో...

రా: మీరు అల్లా విసుక్కుంటూ కొస్తే నాకన్నా సిగ్గు ఉండొద్దూ తాగేందుకు...

గి: అంటే నాకు సిగ్గులేదనేగా...

రా: ఈమాత్రం పెట్టేందుకే సిగ్గంతా పోతే ఇన్నాళ్లు పెడ్తున్న నాకు ఏం పోవాలి?

గి: మళ్ళీ రచ్చ ఎందుకు కాని...ఎన్ని నీళ్లు పెట్టమంటావు?

రా: నే తాగాలని మీకు లేదసలు, ఉంటే మీకు తెలియదుటండీ ఒకళ్లకి మూడువంతులు అవుతే యిద్దరికీ ఎంతో...

గి: తెలియక కాదనుకో...అసలు ఎన్ని పెట్టమంటావు?

రా: అదే తెలుసండీ నా ప్రాణం విసిగించి నేనే పెడ్తాలెండి అనేట్టు చేద్దామనేగా...ఇన్నాళ్ళనుంచి ఉద్యోగం వెలిగిస్తున్నారు, సిగ్గుచేటు కూడాను ఈమాత్రం లెక్కలు రావంటే...

గి: చాలే నా ఉద్యోగాన్నే దెప్పావు.. అదుండబట్టే నీకు యీమాత్రం తిండి పెట్టగలుగుతున్నా...

రా: మీకు అహంభావం కాని ఆ చేసే చాకిరీ బదులు నే వ్రాసే కథలకు మంచి కాపీలు రాసిపంపుతే డబ్బు రాదంటారా?

గి: రాధా చాల్లే యింకేం మాట్లాకు ఒళ్లు మండుతోంది.

రా: ఏమండోయ్

గి: ఓయ్...

రా: కుడివేపు గుమ్మం వెనకాతేం... మెట్టుజాగ్రత్తసుమా...

గి: ఏముంది ?...

రా: కొళాయి ఉంది. క్రింద కూర్చుంటే ఆకుంట తగ్గిపోతుంది.

గి: (రాధ కుట్టుకుంటూ పాడుకుంటూ ఉంటుంది)

తుమ్మెదా తియ్యతియ్యని కోర్కె.
మెయినిండ అలమింది"
అందాలు చందాలు"
మనసును బంధించె"

రా: ఏమండోయ్... యిల్లారద్దురూ...

గి: ............

రా: మాట్లాడరేమండీ? ఏంతోచటల్లేదు. ఈ కుంజేలు బొమ్మ అయి పోయింది...... ఇల్లా వచ్చిచూడండీ.... ఎంత బావుందనుకున్నారు ముద్దు వస్తూ....

గి: (ప్రవేశిస్తూ)

రాధా... ఎంతసంతోషంగా ఉందనుకున్నావ్....

రా: టీ పెడ్తుంటే అంతహాయిగా ఉందా. వంటచేస్తూ ఉంటే యింకాచాలా బాగుంటుంది.

గి: మళ్ళీ మొదలు. ఏదో నీళ్లు పెట్టానా సగంచచ్చి మళ్ళీమళ్ళీ ఆమాట అనడం ఎందుకు చెప్పు...

రా: టీ పెట్టినప్పుడల్లా సగంసగం ఛస్తే నేను యీపాటికి లక్షసార్లు చావడం పూర్తియి ఉండును.

గి: కాస్సేపు...యీ ఆదివారం పూటా తిన్నగామాట్లాడుదూ...

రా: ఇదిమరీ బాగుందండోయ్... తిన్నగా మాట్లాడక యిప్పుడు ఏం చేస్తున్నానేమిటీ....

గి: (తనలో తను అనుకుంటున్నట్టు) ఈ పాటికి ఆ టీనీరు పొంగుతూ ఉంటుంది...

రా: అవవచ్చు....

గి: అందులో ఎంతపొడుము వెయ్యాలో నాకు తెలియదు...............నువ్వు వెళ్ళి దానిపని చుద్దూ.

రా: ఆమాట యిందాకానే అంటే లక్షణంగా ఉండును నా...ఏమిటో 'టీ' కాచడం అప్రతిష్ట అనుకుంటే చెప్పాలంటే....

గి: అంతేనా... ?

రా: అంతే .... లేకపోతే రోజూ పెట్టదల్లే ఈవాళ క్రొత్తఏమిటీ పెట్టనేందుకు.

(రాధ లోపలికి వెళ్తుంది)

గి: ఓరి...భగవంతుడా...... !

(గిరి అల్లిక చూస్తూ ఉంటాడు. ఈల వేసి...)

ఈ రకం
జీవితంలో
ఆనందం
కాళరాత్రి
మబ్బుల్లో
మెరపు కన్నె
అందం......

(రాధ పట్టుకువస్తుంది టీ ట్రే. గిరి అందుకుంటాడు. బల్లమీద సర్దుకుని యిద్దరూ కూర్చుంటారు)

గి: రాధా నువ్వుచాలా మంచిదానవు... మనం యీవాళ ఏ సినిమాకి వెళ్దాం చెప్పు?

రా: అక్కడికి నామాట మీదనే నడుస్తున్నట్టు ...

గి: ఇదివరకు నడవకపోయినా, యికమీద నడుస్తానంటున్నాగా...

రా: అవుతే మనం

(కప్పులో టీ అందుకుని ఒక గుటక వేసి క్రిందపెట్టి......]

అసలు వెళ్ళొద్దు....

గి: అదేమిటి రాధా ?...

రా: అంటే ?

గి: కాదు వెళ్దాం...

రా: మరిమాట తప్పారేం ?

గి: నేనేమన్నా సత్యహరిశ్చంద్రుడననుకున్నావా ?

రా: నన్ను నెమ్మదిగా ఉబ్బేసి...నా మాటేవింటున్నట్టు చూపించి సినిమాకి నన్ను తీసుకువెళ్దా-మనుకున్నారా ? ....

గి: అదేమిటి రాధా ?

రా: అది అదే... మీ నక్కవినయాలు నా దగ్గర... కావు బుట్టలో పెట్టేద్దాం అనుకుంటున్నారు. మహా మీకే కాదు నాకూ ఉన్నాయి చీమూనెత్తురూ...

గి: ఇప్పుడు వాటిగొడవ వచ్చిందీ ?

రా: ఎందుకు రాదూ మీరుచేసే పన్లకి...

గి: ఏంచేశానని అల్లా మండి పడతావు రాధా?

రా: అవును నేను ఉన్నమాట అంటే అది మండి పాటుగానే ఉంటుంది ఉండదూ మరి?

గి: అసలు విషయం ఏమిటి చెప్పు?

రా: ఏం కుదరదు లెద్దురూ...

గి: ఏం కుదరదు చెప్పు ?

రా: నన్నూరికే వాగించకండి. మొన్న నేను సినిమాకి వెళ్దామండీ అంటే మీరు వచ్చారూ!... నేను యిప్పుడు వచ్చేందుకు...... ఏం మీరన్నమాట చెల్లాలి... నే నన్నమాట చెల్లకూడదు అవునా ?...

గి: ఇందులో చెల్లించడానికీ చెల్లడానికీ ఏముంది?

రా: ఏమీ లేదు పాపం...

గి: రాధా ఎంతోయిదిగా అడుగుతున్నాను సర్దాగా వెళ్దామని... రద్దూ...

రా: కుదరదు...

గి: వస్తావా రావా?

రా: ఏం బలవంతంగా తీసుకు వెళ్తారా? నే అసలు రానేరాను...

గి: ఛీ ఛీ ముద్దూ ముచ్చటాలేని మనుష్యుల్తో యింతే.

(పడక గదిలోకి వెళ్ళాడు)

రా: మహా మీరు నా ముద్దూ ముచ్చటా చెల్లించారని. నేను మీతో రావాలి. నేను మీకు ఒక ఆటవస్తువులా కనపడుతున్నాను. నేను ఎంతో సంతోషంగా సినిమాకి వెళ్దామని అడిగితే ఈవాళ కాదు అనేశారు. మీరు అడుగుతే చాలు బుట్టబొమ్మలా సింగారించుకుని నే తయారయి మీతో సినిమాలకు షికార్లకు రావలి కామోసు...... నేనేం ఆట బొమ్మను కాదండోయ్...మీరు యిష్టంవచ్చినట్టు ఆడిస్తే ఆడడానికి...

(లోపనుంచి)

గి: పొద్దుణ్ణుంచి చూస్తున్నా నీ వ్యవహారం. మరీ బరి తెగించి పోతున్నావు. హద్దూపద్దూ ఉండక్కర్లే.

రా: ఆడదాని దగ్గరకు వచ్చేప్పటికి వస్తాయి హద్దులూ పద్దులూ ... రాత్రి పన్నెండు గంటలకు వచ్చినా మీకు సబబుగానే వుంటుంది.

(48 వ పేజీ చూడండి)

# "యమధర్మరాజుగారు పమిలి మ్రింగిన తెలకపిండి"

ఆ క్రితంరోజు సాయంత్రంవరకూ నా వైద్యం స్వయంపాకంమీద నడుస్తోంది. నాటి సందెవేళకి పాకం ముదిరి కరడుకట్టుకు కూర్చుంది.

మకాం—ఒంగోల్లు రహదారి బంగాళా—ఒకవిధంగా శాశ్వత సభ్యత్వం. స్వకుటుంబం మినహా మా పుగాకు కంపెనీ పరిజనులు కావలసినంతమంది యథావిధిగా పరిచేష్టించివున్నారు. వారివారి సంతాపసానుభూతులను ఎప్పటికప్పుడు అందజేస్తున్నారు.

శరీరస్థితి అందుబాటులోనే వున్నట్లనిపిస్తుంది నా మనస్సుకు. ఎటొచ్చీ ఎగశ్వాస దిగశ్వాస.

మా కమిషన్ ఏజంటు రాములు – యేదుగుంటపాడు వాస్తవ్యుడు—ఒక శుద్ధ కోమటిశెట్టి! అయినా తన యిరుగు పొరుగు గుండెల దగ్గరనుంచీ కొదవ పెట్టి వేశాడు నన్ను గురించి.

ఇంజక్షన్లతో నిండిన ఇంగ్లీషువైద్యం నాకు హితవుకాదని తెలుసుకున్నాడు. ఏదుగుంటపాడులోవున్న శంకరయ్య వైద్యుడు నా నాడిని *"ప్యాసింగు" (* "ప్యాసింగు" (*Passing*): పుగాకు వ్యాపారపు కొనుగోలు సందర్భంలో ఎదురయ్యే పరిభాష.) చెయ్యడానికి ఎలాగైతేనేమి తెగించి ధైర్యంచేశాడు. అతడే ఆ వూరికి పూజారి, బడిపంతులు, జ్యోతిష్కుడు, ఘనవైద్యుడు, నిఖార్సయిన లిటిగేంటు!

నాలుగు దిక్కులా పదహారుసార్లు కలియజూశాడు. ఎదురుగా 'శవాకారం – క్షీమ నెడ్డంతో' ప్రత్యక్షమవుత నేనే కాబోలు. నా నాడిమాత్రం జారిపోకుండా బిగపట్టుకు కూర్చున్నాడు!

* * *

రాత్రి తొమ్మిదిగంట లయివుంటుంది.

రాములు నాలిక చప్పరిస్తున్నాడు. అతని మేనల్లుడు నారాయణ నాకు నిత్య కాపలా. ఇతని తమ్ముడు రంగయ్య బంగాళా ఆవరణలో కాసుకు కూర్చున్న 'ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం' వంటి 'మెసెంజర్'. అతని కిరుప్రక్కలా ఇద్దరు కుమాస్తాలు! నా కడసారి మాటల 'స్టేటిమెంటు' ను గుంటూరు హెడ్డాఫీసుకు చేరవెయ్యడానికి ఒకరూ, బెజవాడలో పుట్టింటిదగ్గర కలలుకంటున్న నా భార్యకు వర్తమానం అందజేసి, వాస్తవిక జగత్తును ముఖాముఖి యెదుర్కోడానికి ఆమెను హెచ్చరించడానికి ఒకరు...!

ఏమంటే ఏమౌతుందో అనే జిజ్ఞాసతో శంకరయ్య తలమాత్రం ఊగిసలాడిస్తున్నాడు: అతని దృష్టిలో నేనే ఒక వైద్యమార్తాండుణ్ని... వైద్య నిఘంటువులూ మందుల కేటలాగులూ కంఠతా నాకు రావడంవలన కలిగిన చలవ!—ఏ మందు పేరు చెపితే ఏమనుకుంటానో అనే మీమాంస పడుతున్నాడు.

సరిగా అప్పుడే కాబోలు వేంచేసినట్లున్నారు శ్రీవారు - బంగాళా వరండాలో తటపటాయిస్తున్నారు:

అనేక ఘరానా మనుష్యులు సభకూడివుండగా లోనికి రావడమా అని కబోలు...

శంకరయ్య కడకు నా జాతకంతో భవిష్యత్తును లెక్కకట్టి నీరసంగా మూలిగేడు: "* నెమ్ము బాగా యెక్కువయి పోతోంది—" (* నెమ్ము: ఒంగోలు గ్రామీణ తెలుగులో 'జలుబు'కు వాడుక పదం: ఇక్కడ 'వాతం' కావచ్చు, 'కఫం' కావచ్చు...) ఇంకా అనేకం కావచ్చు!

చివరకి ధైర్యం చేశాడు, "కందుకూరులో మా మావఁగారిదగ్గర మందులు - వంటౌషధాలు...మంచివి...మరి మనిషిని –" అంటున్నాడు.

"పంపిద్దాం..." రాములు అందుకున్నాడు. "నారాయణా! రంగయ్యని సైకిలేసుకుని—"

నారాయణ బయలుదేరబోయాడు: రాములు - "నే పంపిస్తాలే" అన్నాడు. "ఇలా చూడు పంతులూ!" అని శంకరయ్యతో గుసగుస లాడుతూ బంగాళా వరండాలోకి నడిచేడు.

—అంతి అయ్యావారు లోనికి విచ్చేశారు - మెల్లమెల్లగా, చల్లచల్లగా, అతి బరువుగా! ఇంతవరకూ ఉక్కబోస్తున్న గది వాతావరణం మారిపోయి నాకు చలి వేస్తున్నట్లనిపించ సాగింది.

'రాయబారం' నాటకంలోని అద్దంకి శ్రీరామమూర్తిగారి 'విదుర' వేషం నాకు స్ఫురణకు వచ్చింది. నారాయణ తనలో గోలలో విలవిల మసులుకుంటున్నాడు: మందుసీసాలు సర్దేడు. లైటు పెద్దదిచేసేడు. వరండా గుసగుసలు మనసుని పీకగా అటు తిరిగి చీకట్లో విలీనమయ్యాడు.

నా మంచం సమీపించేరు శ్రీవారు. వెనక వీరిని చూసినసంగతి నాకు గుర్తుకు వచ్చింది: బ్రాహ్మణ నిడమానూరునుండి పుగాకు బేళ్ళు ఒకే ఒకసారి అమ్మకానికి తరలించుకు వచ్చేరు... వీరే అనుకుంటా—లేక ఆయనకి తమ్ముడో ఈయన. అందరు రైతులతోటీ ఈయన పుగాకు లెక్కకుండా సుప్తాగా ఇచ్చివేసినట్లే నాకు జ్ఞాపకము.

మంచంమీద కొస్త లేవబోయాను, కూడదనుకుంటూనే. శ్రీవారిని ఆశీనులు కమ్మని సంజ్ఞచేశాను. వారు నన్ను పరిశీలిస్తున్నట్లున్నారు.

'మీకు సుప్తాగా ఇచ్చేశామనుకుంటా—" అన్నా, ప్రారంభవాక్యంగా.

ఆయన బహు కొలదిగా చిరునవ్వు కక్కబోయాడు; నన్నూ నా రోగాన్నీ మానీ నిరసించాడు.

"మీరు ఇంకో రెండుమూడు వారాలు తాళింతర్వాత రండి." నాకు కొస్త వోపిక వచ్చింది. లేచి కూర్చున్నా. "అప్పటికి మా చేతికూడా కొంత డబ్బందుతుంది. నలుగురు రైతులకీ అంతో ఇంతో కొదవ పెట్టాలనే మా వుద్దేశ్యం -" అన్నాను, పొరలుగా దొర్లుకువస్తున్న ఆయాసాన్ని దస్తునూ ఆపుకుంటూ.

ఆయన ఏదో సమాధానం చెప్పబోయాడు - నేను రాబోయే సంవత్సరపు పుగాకు ధరలను గురించీ ఫలితాలను గురించీ

యథాశక్తి పరీక్షిస్తున్నా. నాలో ఉత్సాహం బయలుదేరుతోంది - ఎదురుగా బల్లమీద నిరీక్షిస్తున్న సిగరెట్టు డబ్బా అందుకోబోతున్నా - ఇతోధిక యోగబలాన్ని చేకూర్చుకుందామని...

—ఇక ఆయన తాళలేకపోయాడు;

ఒక్కసారి ఆయన శరీరమంతా దద్దరిల్లినట్లు కంపించిపోయింది;

"నేను యమధర్మరాజా గార్నండి" అన్నాడు.

* * *

ఆ మాటలకు నేను కొంచెం ఆలోచించవలసిన పరిస్థితి యేర్పడింది. ఇక తప్పదని సిగరెట్టు ముట్టించేను. ఒక్క పీల్పుతో పొదిలోని ప్రాణంవలె, లోనున్న దగ్గంతా వెలికివచ్చి నిలబడింది.

"ఎక్కడ పనిచేస్తున్నారూ?" ఏదో అడిగేను—

"అబ్బే—ఇదే రావడమండీ"—

"అంటే-?"

"అంటే - మీపని మీదేవస్త... లెఖ్ఖ సుప్తా అయింది కాబట్టే—"

నా జుట్టంతా తడిసిపోతోంది. ఒకవంక కాళ్ళూ చేతులూ బరువెక్కుతున్నాయి. నాలో - లోలోన - ఇంకా మిగిలున్న ఇంగితం ఏదో స్ఫురింపజేసింది—

"అంటే... తమరు..."

"చిత్తం..."

నేను గతుక్కుమన్నాను. రైలుబండి టాపుమీద నిలుచుని ప్రయాణం చేస్తున్నట్లనిపిస్తోంది. "అప్పుడే యేం కొంప ముంచుకుపోయిందండీ" అని మాత్రం నసకగలిగేను.

నా కళ్లముందు తిరుగుతున్నారు: పయ్యిమంది ఆడకూలీలు, పందమంది మొగకూలీలు, గుమాస్తాలు, రైతులు, ఎక్సైజు డిపార్టుమెంటు, గ్రౌడింగు కావలసివున్న నెయ్యి బేళ్లు పుగాకు... ఇంకా సంవత్సరం కూడా పూర్తిగా కాపురం చెయ్యని పుట్టింటిదగ్గర పడివున్న ఇల్లాలు - అమలాపురంలో వున్న అమ్మ, నాన్న, చెల్లెళ్ళ సైన్యం...

శ్రీ యమధర్మరాజావారు యెదురుగా కుర్చీలో భోజనాని కూర్చున్నారు. నా కర్తవ్యాన్ని ఒక పెద్ద పర్వతంలా క్షణం క్షణం యెదురుగా కనపరుస్తున్నారు.

"కూర్చోడానిక్కూడా శక్తిలేని ఈ పరిస్థితుల్లో ఈ ప్రయాణం ఎల్లాగా అని?"

వారి ముఖం విప్పారింది: "మీకు శరీర కష్టం యేమాత్రం ఉండదులెండి!"

"అది సరేలెండి -" ఆయన మాటలు, అసలే నీరసంగా వున్న నా గుండెలకి, గుచ్చుకున్నట్లయింది. "లెక్క సుప్తా అయిందని మీ రంటున్నారేగాని," యేదో నూతిలోంచి వస్తున్నట్లు నా కంఠస్వరం నాకే అనిపిస్తోంది, "నా పుస్తకాలనిబట్టి అసలు కాతాలు సరిపడ్డాయో లేదో చూచుకోనక్కరలేదా?"

"అయ్యిందంటు—"

"అంటే అయిపోయినట్టేనాండి?"

"....................."

"ట్రయల్ బ్యాలెన్సు వెయ్యాలి - బ్యాలెన్సు షీటు - ప్రాఫిట్ అండ్ లాస్ చూడాలి—"

"....................."

"మీరు ఎక్కువగా మాట్లాడకండి స్వామీ! ఉత్తణాప్యాన్ని ఆయాసం వస్తుంది..." ఆయన బుద్ధదేవుడిలా గ కూర్చోడం నాకు కొంత హెచ్చరికగా వుంది. "మనం వుండేది వ్యాపారయుగం. రైతు అన్ని కనీస హక్కులూ అనుభవిస్తూ రూపాయల నోట్లకట్టల మధ్య నలిగిపోతూ దొర్లుకుపోతున్నాడు. అసలే కలికాలం - అందులోనూ చలికాలం! ఇక - మంచి నీళ్లేనా దొరకని వొంగోలు పురం!!... ఏదో మనం లెక్కలు సరిచూసుకుని ఫలానా చోట ఉన్నాం అని మర్యాదాగా అనిపించుకుంటే సబబు -", అని, చిత్రగుప్తునిమీద భారంవదలి, నడుం వాల్చేను.

రాజావారు ఒక్కక్షణం వారి వేళ్ళ ఉంగరాలకేసి దృష్టి పోనిచ్చుకుని సాగించేరు: "పంతులుగారూ! ఉత్తి కంఠశోష పెట్టుకుంటున్నారు! నా లెఖ్ఖ కరక్టు...

## 'యమధర్మరాజుగారు నమిలిమ్రింగిన తెలకపిండి'

లెఖ్ఖ ప్రకారం మీరు ఒక్క క్షణం ... ఇక్కడుండ డానికి వీలులేదు."

... వాడు వళ్లు మండిపోయింది. కపీలున మంచంలో లేచి కూర్చున్నాను.









"ఏదీ - అవర్జా ఇలా యివ్వండి..."

"ఆయన వెనక్కొ ముందూ చూడసాగేడు.

"తేలేదా? ఉం! నాకు తెలుసు. ఇది నిత్యానుభవం!"

"ఇది సామాన్యంగా అవసరం వుండదు కాబట్టి-"

"తమరు తేలేదు. అసలు అవసరమే లేదు లెండి! లెక్కలు - సుప్తాలు- అంటూ ఏవేవో పదాలు దొర్లించేరు. కాబట్టి అవర్జా విషయం తెచ్చేనే గాని—"

"రామరామ - యంతమాట! లెఖ్ఖ మాత్రం శుద్ధ—"

"నిజం!!"

"చిత్రం—"

"కాదని నే ననగలనా?...ఒకసారి ఈ కళ్ళు ఈ బొందని వుండగానే చూసుకుందామని - అదో తృప్తి! వెర్రి!!"

మనిషి కొస్త జంకుతున్నట్లు కనపడ్డాడు.

"కానియ్యండి. ఇదంతా అనవసరమే! వట్టి కంఠశోష!!" ఇక ఉపన్యాసం సాగించాను. "రెండేరెండు మార్గాలు: చిఠా అవర్జాలు తెచ్చి ఋజువుపరుచుకుని నన్ను తీసుకుపోవడం: లేదూ - అందరిమాదిరే! పీకకి తాడు మెలేసి తీసుకుపోతారో - ఏ పెట్టెలోనన్నా పార్సెల్ చేసి అందిపుచ్చుకుంటారో!...మాటవరసకే అనుకోండి - 'ఇప్పుడివన్నీ అడగడానికి నువ్వెవడివోయ్ మొండా'-అంటే నోరునొక్కుకు కూర్చోవలసిందేకదా!..."

"............"

"మీరు 'యమరాజు' అని కాక 'యమధర్మరాజు' అని పేరు పెట్టుకున్నారు కాబట్టి ఈ స్వస్తి. లేదూ ఇండియా ప్రభుత్వంలాంటి ఉల్లిపాయల వర్తకమంటారా మీది? కానియ్యండి - చేతులెత్తేస్తాం—"

—అని వెల్లకిలా పడుకున్నాను.

"అంటే నామాటమీద నమ్మకం లేదంటారా?" అన్నాడు దీనంగా.

"మహాను భావా!" ఒక్క నమస్కారం బంగాళా దూలానికి సమర్పించేను. "నేనెంతటివాణ్ని? మహా అల్పుణ్ని. ఏ మంచి నీళ్ళు తాగుతూంటేనో సిగరెట్టు కాలుస్తూంటేనో గుటుక్కుమనిపోయే ప్రాణంగలవాణ్ని...ఎంతటి మనుకొరవూ తీపీ ఈ కళేబరంమీదుంటే మాత్రం? ప్రాణమే నాది కానప్పుడు బూడిదయి పోయే ఈ బొందెమాత్రం నాదా? నేను.... నేను..."

"నమ్మకం కూటంటున్నా—?"

"కావలసినంతుంది - భయం కూడా ఓ కొండంత వుంది. మాటలమీద ఎప్పుడూ నమ్మకం వుంటుంది. లేకపోతే ఈ వ్యాపారానికి పనికివచ్చేవాణ్ణి నేకాదు. మాటలు...

చేతలలోకీ - ఆచరణలలోకీ వచ్చేసరికే వచ్చి వెలక్కాయ గొంతుకలో పడుతుంది... ఇంతకీ ఆ రోజులు వేరు. ఆ ధర్మమూర్తులు వేరు. ఇక ఆ కనపడే మీ శరీరం కూడా పాత పుక్కిటి పురాణమే అయినా - కాలాన్ని బట్టి తత్వం మారిపోడం లేదూ? తేజస్సంతా చచ్చిపోలేదూ? లేకపోతే - ఈ దీనుడు - కేవలం ఈ సామాన్య మనిషి ప్రాణి - మీ మొహం కేసి చూడడమే! స్వయాన మీ మొహంమీద సిగరెట్టు కాల్చి పారెయ్యడమే?! ...అందుకనే నమ్మకాలు సన్నగిల్లి నశించిపోతున్నాయ్! బుజువులు చేసుకునే అవసరాలు ఆసన్నమయ్యాయ్..."

అతను కొంతసేపు గింజుకున్నాడు; మరింతసేపు చాలా చాలా జంతికలు నమిలేడు; చివరకు లేచి నిలబడ్డాడు:

"ఏదో కొన్ని గంటల తేడాలో నాకు పెద్ద ముప్పొచ్చేదేమీ లేదు - అందు ననుసరించి నన్ను నిలవదియ్యడానికి ఏ త్రిమూర్తీ దిగిరాడు. 'ప్రెస్టిజ్' కోసం బాధపడుతున్నా...... లెఖ్ఖ సరిచూసుకున్నాకే కానిద్దాం లెండి—"

"అబ్బే యంత మాటా? మీరు పని ముగించుకు—"

"మళ్ళీ వొస్తాలెండి......అందాకా సెలవ్—"

నాకు చాలా నీరసం వచ్చేసింది, కళ్లు గిర్రున తిరగసాగేయి, చెవుల్లో వడగాడ్పులు వీస్తున్నాయి, ఈ వాగ్యుద్ధంతో ప్రాణం కాస్తా చప్పబడిపోయింది, ముచ్చెమటలూ పోశాయి... కళ్లు మూసుకున్నా.

స్మారకం తప్పిపోతుందేమో... ఇన్ని నీటిచుక్క లెవళ్ళన్నా నోట్లో పోస్తే బావుండును. ఆయన వెళ్ళిపోయేడు - కాసిని మంచినీళ్లం దించేవాడు. సోలిపోతున్నా—

మరి కాస్త సేపటికి - నారాయణ కాబోలు - తులసి పసరులాంటి నీళ్ళు నా నోట్లో పోస్తున్నాడు! నా ప్రాణాలు కుదుటపడుతున్నాయి...

* * *

మధ్యాహ్నం మిడసరి అగ్గం వేళ - కేవలం నిరాకార నిరంజన స్వరూపంతో - ఇటు భూమికీ అటు ఆకాశానికీ కాకుండా - మంచం అనే అంపశయ్యమీద పడివున్నా.

నాగది కురుక్షేత్ర మయ్యింది. నా శరీరం ఒక పద్మవ్యూహం. అందులో రారాజున్నాడో లేడో కాని వందమంది అభిమన్యులు మాత్రం వ్యూహాన్ని ఛిన్నాభిన్నం చేసుకుపోతున్నారు - తెల్లవారు ఝామునుంచీ.

ఓకవంక శంకరయ్యా అండ్ కంపెనీ వారు శరీరంలోని ప్రతి భాగాన్నీ తెగ తెంపులు చేసుకుని పంపకాలు సాగించుకున్నారు. ఎవరికి వచ్చిన వాటాతో వారు కుస్తీలు పడుతున్నారు.

అంతా వారి యిష్టం - వారి చిత్తా చిత్తం. ఉత్సాహం కొద్దీ ఒక్కొక్కసారి సలసల నీళ్లతో నన్ను కాల్చిపారేస్తున్నారు. రంగు రంగుల పూతలు పట్టిస్తున్నారు. గుండెలమీద బరువులు పెట్టి పెట్టి హఠాత్తుగా దించేస్తున్నారు. నన్ను నలిపి నలిపి, ఉక్కిరి బిక్కిరిచేసి, చెరుకు పిప్పిని చేస్తున్నారు.

వీరి వీర విహారానికి తాళలేక నాలో వున్న మాంస కండరాలను రవంత సేపు ఎక్కడో దాచుకున్నాను. నరాలను చంపి వేసుకుని బొమికలను మాత్రం వాళ్లకు వదిలి పెట్టేను...

వారి యధాశక్తి పరిచర్యలతో మధ్యే మధ్యే నాకు స్పృహతప్పిపోతోంది. నా బాధ వాళ్లకు చెపుతున్నా. నా భాష అర్థం చేసుకునే స్థితిలో వారు లేరు. వారి మాటలూ వారి చేతలూ నా కర్థం కావడమే కాదు, నా శరీరంమీద కావ్యశిల్పాలుగా కలకాలం మిగిలుండి పోతాయి.

ఎందుకేనా మంచిదని గుంటూరు పోడా కేసుకు ఒక మనిషిని తోలేరుట. బెజవాడ తోలకాన్ని గురించి శషభిషలు పడుతున్నట్లు తెలిసింది.

"ఈ సాయంత్రానికి గడిచి 'వేడి' అందుకుంటే -" ఫరవాలేదనే మాత్రం వారిలో వారు ప్రచారం చేసుకుంటున్నారు.

కడసారి ప్రయత్నంగా ఒక్కుమ్మడి పదిమందీ నామీదకు విరుచుకుపడ్డారు. అసలే విరిగిపోయిన నా శరీరభాగాలను మంచానికి తాపడం చేసేశారు. అదేదో ద్రావకాన్ని శంకరయ్య సహాయంతో రాములుశెట్టి అతి నేర్పుతో నా నోటిగుండా కడుపు తిత్తిలోకి, అక్కడనుంచి పేగుల సమూహంలోకి, బలవంతాన్ని వ్యూహాస్త్రాలతో నెట్టి తన ఉపజ్ఞతను ప్రకటించుకున్నాడు.

ఇంతవరకూ నిద్రపోతున్న నా పేగులు ఆ ద్రావకంతో పెనుగులాడుకో సాగేయి. లోపల జరుగుతున్న వ్యవహారానికి ఒకవంక నాకు నవ్వొస్తోంది. ఆ సంగతి నా పెదిమలు చెప్పలేకపోతున్నాయి. అది ఈ మనుష్యులు కనిపెట్టగలిగే స్థితిలో లేరు. చివరకు ఎదురుతిరిగిన పేగులే గెలిచేయి... పెద్ద వాంతయింది...

"ఇప్పుడిక చేసేదిలేదు... రెండు మూడు గంటల్లో మనిషి దార్లోకి రావాలి... ఆ తర్వాత ఆ పరమాత్ముడి దయ. అప్పటి వరకూ మనం అతి నిశ్శబ్దంగా వుండాలి... రోగి నిద్రపోవాలి."

—ఇది నా ప్రాణంతో యుద్ధం చేస్తున్న ఘనవైద్యుడి 'బులెటిన్'.

* * *

ఎన్ని గంటలయ్యిందో సరిగ్గా చెప్పలేను. బరువెక్కిన నా కళ్లను తెరచుకున్నాను. శ్రీ యమధర్మరాజాగారే ముందుగా విచ్చేశారు. నిన్నటి గుడ్డలే వేసుకుని వున్నారు. ఓ కుర్చీలో ఆసీనులయ్యారు... మౌనముద్ర వేశారు.

మరి కాస్తసేపటికి పెద్దపెద్ద ఖాతాంకి పుస్తకాలు రెండు మోసుకుంటూ ఒక ముసలి నాటుకోటిశెట్టి బ్రాహ్మడుగారు వచ్చేరు—

"మా ఎకౌంటెంట్ జనరల్ - చిత్రగుప్తుడుగారు..." రాజావారు పరిచయం ప్రారంభించేరు. "ఇక్ష్వాకుల పూర్వీకుల నుండి అందరి ఖాతాలూ వీరికి కంఠస్థం!"

నేను మందహాసం చేస్తూ, "ఆ సంగతి తమరు వేరే సెలవియ్యాలా?" అన్నా. లేని

# 'యమధర్మరాజుగారు నమిలిమ్రింగిన తెలకపిండి'

శక్తిని తెచ్చుకుంటూ మంచంమీద చదికిల పడి, తలగడాలను దగ్గరకు లాక్కున్నా. చేతులూ కాళ్ళూ, వాటి మీదున్న రంగుల పూతల చిగింపులతో, నాకంత అందుబాటులో లేవు.

చిత్రగుప్తుడుగారు నవ్వు కళ్లతో నావరా కుర్చించారు. రెండు పుస్తకాలనూ బల్లమీద దించేడు. వాటి బరువుకి మునిసిపాలిటీవారి పురాణ యంత్రబ్రహ్మ మేజాబల్ల కాస్తా జవజవలాడిపోయింది.

"చిత్రగుప్తులవారూ!" రాజాగారు కీచిగా హుకుం జారీ చేస్తున్నారు. "వారిని పూర్తిగా సంతృప్తుల్ని చెయ్యాలి." తమ శరీరాన్ని కుర్చీలో చేర్లాపడవేసుకున్నారు. ఎడంకాలిమీదికి కుడికాలు పోనిచ్చేరు. వారి కాలిజోడు మీసాలు గాలిలో కదలసాగేయి. "అప్పటికి పని పూర్తయిందీ అవాలి—"

చిత్రగుప్తుడుగారు కూడా సుఖాశీను లయ్యారు - వేరే కుర్చీలో. మునిసిపాలిటీ బల్లనే తమకు అనువుగా దగ్గరకు ఈడ్చుకున్నారు. పాత పట్టుపంచల గుడ్డతో బైండయిన రెండు పుస్తకాలనూ తమకు దగ్గరగా లాలించుకున్నారు.

ఆ తంతంతా చూస్తూవుంటే - ఓ సులకతాడు కళ్ళజోడూ, కొబ్బరిటెంకె పొడుంకాయ కూడా నాకు స్మృతికి వచ్చేయి. కాని, వాటి అవసరం గుప్తుడుగారికి లేశం కూడా ఉండదు. ఒక్కసారి తమ పొడుంకాయ పిలకని మాత్రం ఝూడించుకుని గట్టిగా ముడివేసుకున్నారు. మెడలో వేళ్ళాడుతున్న గుప్పెడు జంఝాలనూ సరిచేసుకున్నారు.

గుప్తుడిగారి ముఖాన విబూది రేఖలు మాత్రం దిట్టంగా కనపడుతున్నాయి. వ్యవహారం చూస్తే కనీసం రెండుసార్లన్నా భోజనం పూర్తిచేసినట్లు కనపడుతుంది. చూడ చూడ వీరు వీరశైవు లనిపిస్తుంది. ఇంట్లో సహధర్మచారిణిగారి పోరుకూడా కొంత ఉండివుండవచ్చు. పిల్లా జెల్లా విషయం మనకు తెలియదు. అడిగినా చెప్పేరకం కాదు.

యమధర్మరాజు అంతంత మాత్రంకూడా దొరికి పోయే ఘటం కాదనుకుంటాను. ఆయన వ్యవహారం చూస్తే, అవసరంవస్తే ఇక్కడ పదికాలాలపాటు తిష్ఠవేసేటట్లు కనపడుతుంది. అహంకారం - అహంభావం వగైరాలన్నీ వున్నా ముఖాన ఒక అమాయకత్వం తాండవిస్తుంది. జాతిమతాలు తెలియడంలేదు. అవి మూడువంతులు, నాగరికతా లక్షణా లవడంచేత, ముఖంమీద ప్రత్యక్షంగా స్ఫుటం కావడంలేదేమో. మీసాలు మాత్రం తీర్చి దిద్దినట్లున్నాయి.

వీరి విషయంలో ఒక్క సంగతిమాత్రం నిఖార్సుగా చెప్పవచ్చు. ఈ జాతకుడికి కుటుంబంలో ఈతిబాధలు వుండివుండవు. ఒకవేళ ఉన్నా అవి పట్టించుకోకుండా తిరగగలిగే ధీశక్తివుంది. ఎదిటివారిని చూస్తూ చూస్తూ అన్యాయం చేసెయ్యడం చేతకానివాడని చెప్పవచ్చు. ఈ ఒక్క గుణప్రభావమే ఈ వ్యక్తికి ఈ మహోన్నత పదవిని సమకూర్చింది...

చిత్రగుప్తుడు యంత్రబ్రహ్మ కాడు. ఘటికుడు. మా రాములు శ్రేష్ఠికూడా కూడికలలో ఘనుడేకాని, నరకానికి ప్రయాణమై వెళ్లినతర్వాత, ఆ నాలుగువేల సంవత్సరాల సర్వీసు దివాణంలో పూర్తిచేసినా అతను చిత్రగుప్తుడు కాలేడు సరికదా, అఖరికి 'జాయింట్ - సబ్ - అసిస్టెంట్ - డిప్యూటీ' చిత్రగుప్తుడుకూడా కాలేడు!..

"ధర్మరాజా!" నేను మర్యాదా కుశల ప్రశ్నలు కానిస్తున్నాను. "మీ యింట మహాలక్ష్మి సమానురాలైన 'యమి' మహారాణీగారు క్షేమమే కదా?"

యమధర్మరాజుగారు సావధానంగా సమాధానం చెప్పబోతున్నారు—

చిత్రగుప్తుడు వెంటనే కార్యక్రమం ప్రారంభించేడు - 'ఇటువంటి అనవసర ప్రసంగం మంచిదికాదు' నే చూపు రాజాగారికేసి పోనిస్తూ—

టకటక ఎక్కాలు వప్పగించాడు; నా కాతాన జమా ఖర్చులు మానాలుగా మంచినీళ్లప్రాయంగా విమానవేగంతో చదువుతున్నాడు; నా గుణగణ వర్ణనలు అర్థానుస్వారాలుగా మార్చివేశాడు.

నే యెరగని వ్యవహారాలకు, తెలియని సన్నివేశాలకు - చక్కగా క్రయంకట్టేడు. నే యెరిగివున్న వాటిల్లో నన్నే నేరుగా విక్రయం చేశాడు... వెడుతోంది పవన గుడిగాలి ధీమాతో! నా బ్రతుకులోని కడసారి అధ్యాయాలకు వచ్చేస్తున్నాడు.

ఒకానొక ఘట్టం టకటక చదివి, 'ఖర్చు యింత' అన్నాడు.

అప్పటికి నాకు ఊపిరి కొంత అందుకుంది.

"అగండక్కడ" అన్నాను. "ఆ వ్యవహారమంతా మీరు సవ్యంగా 'రివర్సు' చెయ్యాల్సుంటుంది."

"అదెలాగ ???" తలె త్తకుండానే కొర కొర చూశాడు; 'ఇటువంటివి కొరకబడవోయ్ పంతులూ' అనే ధీమాతో.

"దానికేముందీ-" ఈ తప్పుల్ని తీస్తున్న పద్ధతిలో అన్నాను. "రోజు ఋక్కు ద్వారా 'పాస్' చెయ్యండి... గాలిలో ఒక్క చెయ్యి ఆడించినంత మాత్రం చేత చప్పట్లొస్తాయా? అందులో ఇక్కడ రెండు వేరు వేరు చేతులు కలిసేయి...గాజుల చేతులుకూడా వున్నాయి!...ఇంతకీ అటూ ఇటూ కూడా వుంది. కొంత ఖర్చు; అంతే జమ..."బిటమ్ కాన్సెల్" అవుతుంది! మొత్తం ఆరు ఎంట్రీలు !!"

చిత్రగుప్తుడీమాటు గట్టిగానే చిరాకుపడ్డాడు. "ఇది వడ్డీవ్యాపారం కాదండీ - అలాగ తకీల్ను కాన్సెల్ చెయ్యడానికి—"

"అంటే వడ్డీవ్యాపారం తమకు అలుసయింది! అదే లేకపోతే తమ రెక్కడుండేవారో?"

"ఆఁ - మాట సామెతకన్నాను—"

"సామెతకే తీసుకుందాం... నే చేసేది వడ్డీవ్యాపారం కాదే! కంపెనీ...ఫరం... ఇండియా ప్రభుత్వపు చట్టప్రకారం రిజిస్టరు కాబడిన సంస్థ!—అప్పాస్తులు పరిమితం చేసుకున్న వ్యవహారం?! యాక్టు ప్రకారం నడుచుకుంటున్నాం—"

"వడ్డీగొడవ వొదలమన్నాను కదయ్యా దేవుడా!"

"ఎల్లా చూసినా - అసలు పోయినా వడ్డీయేకదండీ మిగిలేది? కావలిస్తే కాశీయాత్రకు వెడుతున్న మా సీతన్నగార్నడగండి—ప్రాణమేనా యిస్తాడుగాని వడ్డీ వదుల్తాడా?"...

నేను సిగరెట్టుమీద సిగరెట్టు కసితో కాలుస్తున్నా. నా వ్యవహారం పట్ల మొహంలో అసహ్యం ప్రదర్శిస్తున్నా, మర్యాదకోసం ఒకటిరెండుసార్లు ఆలోచించి, తల ఊగిసలాడించి, చివరకు అన్నాడు చిత్రగుప్తుడు:

"మీరన్నట్లు ఐటమ్ కౌన్సెల్ చెయ్యడానికి యెంతమాత్రం వీల్లేదండి పంతులుగారూ!"

"వీలుండీ లేదూ..తర్వాత చూద్దాం..." తాపీగాఅన్నాను."యమధర్మరాజు గారూ! ఆ బల్లమీది కాగితం పెన్నూ అందుకోండి ఆ ఐటమ్ కాస్త నోట్ చెయ్యండి...ఆఖర్ని చర్చిద్దాం—"

పాపం! ధర్మరాజు లేవబోయాడు.

ఏదో కొంప కూలిపోయినట్లు రెండు చేతులూ తూర్పుపడమరలకు తిప్పి, "ఈ తంతంతా చూస్తే" అని గింజుకుంటూ లేచి నించున్నాడు చిత్రగుప్తుడు, "లెక్కల పరిష్కారం నెల్లాళ్లు పట్టేటట్లుంది—"

"మరేం విచారించకండి. ఈ వూళ్ళో వెలిసివున్న * ఆదిలక్ష్మమ్మ ధర్మమా అంటూ కుష్టుగా భోజనం దొరుకుతుంది - అన్నిరకాల కవితా శయ్యలూ అమరగలవు..." (* ఆదిలక్ష్మమ్మ: భోజనపు హోటల్ గల వితంతువు.) అన్నా వెటకారంగా—

తన మూడో కంట మాడసాగేడు గుప్తుడు నన్ను;

"...అవసరమయితేనే - కావలసినవారికే లెండి..." అని ముగించేను.

వ్యవహారం రసాభాసవకుండా తన్ను తను సంబాళించుకున్నాడు; వసాహైసా తెమిల్చెయ్యొచ్చంటే—"

"పాపం దిగివచ్చారు! సాము లు!! అవునా చిత్రగుప్తుడు గారూ? ఈ బాధలెందుకు? ఈ మడికట్టుకున్న పుస్తకాలెందుకు? దినదిన భత్యంలాగ రోజూ నాకోసాన అంతంత ఖర్చెందుకు?"

"నువ్వు రోజూ ఆడిన అబద్ధాలవిలవ!"

"అంటే తమ దివ్యచిత్తంలో నే జన్మరెత్తింతర్వాత నిజం మాట్లాడలేదు - మీ కంటికి కనపడే మంచి చెయ్యలేదు - అని మీవాదన!"

"యల్లాగంటానయ్యా ? మార్చి నెలలో ఆరుసార్లూ ఏప్రిల్ నెలలో నాల్గుసార్లూ... మొత్తం పదిసార్లు నిజం మాట్లాడగలిగేవు-"

"మరి నే చేసేదేవిఁటి?"

"వ్యాపారం...పుగాకు..."

"ఈ వ్యాపారం లాభించాలంటేయెలా? ఈ వ్యాపారాన్ని దినదినప్రవర్ధమానం చెయ్యడమే నా ప్రధాన విధ్యుక్తధర్మం కదా ... కొన్ని వందలజీతంయిస్తూ, నన్ను నమ్మి కొన్ని లక్షల ఖరీదు వ్యాపారాన్ని నాకు ధారపోసినకంపెనీని హరిశ్చంద్రుణ్ణయి గంగలో కలపనా ? అవిధంగాచేసినా చివరికి నాకోసాన 'మోసం - అన్యాయం వగైరా రూల్సుకింద' నీచేతిలోపడేది ఖర్చే కదా!...నువ్వు చేసేదేవిఁటి?"

"ఈ బండచాకిరీ - "

"అది లాభించాలంటే ? పకడ్ బందీగా ఎకౌంట్లు తయారీచెయ్యడం ... నువ్వు వండిన ఈవంట ఎప్పుడేనా ఈ మొనగాడు రుచిమూశాడా?"

ఆ మాటకు యమధర్మరాజుగారు అడ్డుకున్నారు - "నేను బ్యాలెన్సు షీటు చూస్తూవుంటా-" అని సర్దుకున్నారు.

"అదికూడా ఈయన వండిపెట్టిన యిడ్లీయేగా-" అని ఊదిపారేశాను. "ఇంతకీ... రాజా గారూ! క్షమించాలి - తమరు చదివినంత మాత్రాన్నే బ్యాలెన్సుషీటు వెనకాలి వ్యవహారాలన్నీ సమగ్రం చేసుకోగలిగే తాహతుగల వ్యక్తిగా మాత్రం కనపడ్డం లేదు—"

"యంతమాట! యంతమాటంట!!"

కలత చెందిపోతున్న రాజాగారివేపు నిదానంగా చూస్తూ అన్నాను :

"మీ ఘనత వేరే వుంది. మీ చేతిలో ఎల్లప్పుడూ న్యాయం జరుగుతుంది. ఆఖరికి ఓ క్షయవ్యాధిక్రిమికి కూడా నిఖార్సయిన న్యాయం జరిగి తీరుతుంది. న్యాయశాస్త్రంలో మీరు ఓ లైబ్రరీ...ఇక్కడ ఈ లోకంలో సుప్రీంకోర్టు కెళ్ళినా దొరకని న్యాయం మీదగ్గరేనా దొరుకుతుందని మా అందరికీ ఓ ధైర్యం. అందుకే 'వరమానవు' డనటూ మీకు లంచా లివ్వము. ఆ బుద్ధి మీకు లేదని అందరికీ తెలుసు. ఈ చిత్రగుప్తుడు గారికిమాత్రం వ్రతాలపేరుతో ఖచ్చితంగా లంచా లిస్తాం - ఆయన సజావుగా స్వీకరిస్తాడనే మాఅందరి నమ్మకం.."

చిత్రగుప్తుడు కుతకుత ఉడికిపోయాడు"

"నాకోసం నోములు చెయ్యమన్నానా??

"అన్నావో లేదో - చేస్తున్నారా లేదా? ఆఫీసరుగా అడిగితేనే ఇస్తున్నామూ లంచం??"

వ్యక్తిగతంగా తాము సంతృప్తి చెందినట్లే ధర్మరాజుగారు ఒకవంక కనపడుతున్నారు. చిత్రగుప్తుడు తనలో తను కీచులాడుకుంటున్నాడు.

నే నింకో సిగరెట్టు వెలిగించేను. "ఎన్ని చెప్పండి - ఈ చిత్రగుప్తుడు గారి వ్యవహారం ఏదోలా వుంది. ఈయనమీద చెకింగేవిఁటి? ఈ లెక్కలన్నీ ఆడిట్ చేయించేరా? ఈయన గీసిన గీటు—"

కూర్చున్న చిత్రగుప్తుడు ఇక తమాయించలేక, ఒక్కసారి లేచి నిలుచున్నాడు:

"పంతులుగారూ! నోరు చించుకుని హైరానా పడకండి...మా కాలఖర్మ వశాత్తూ ఈ పుస్తకాలు నెత్తి నెట్టుకుని ఏదో మారుమూలలనించి అన్ని యాతి బాధలూ పడుతూవొచ్చాం. అయిందేదో అయింది. ఇది నలుగురికీ తెలిసిందంటే - మాబాధ ఆ భగవంతుడికే తెలియాలి. ఇంక ప్రతీ వెంకట్రామయ్యా లెఖ్ఖ సరిచూసుకునేంతవరకూ రానంటాడు!"

"అబ్బో! యేం బాధపడిపోతున్నావయ్యా!! అక్కడికి అందర్నీ అడిగి వారి పర్మిషన్ తీసుకునే వెళుతూన్నట్టు!"—

"అబ్బెబ్బె—" రాజాగారు సమాధానం చెప్పేరు. "అడిగిన తర్వాతే - ఇష్టముంటేనే - తీసుకెడతామండి. అది మా దివాణం లాయఖీ—"

"ఇల్లూ వొళ్లూ తెలియని స్థితిలో 'ఊఁ' అంటాడు - సరే - కానిచ్చేస్తారు..."

"విధానం ఏమైతేనేమిగాని - ముందు ముందు మా బాధ-" అని చిత్రగుప్తుడు—

"అవవచ్చునండీ. మీకు బాధే! ఇందరు ప్రాణుల లేఖలూ మీరే తయారు చేయింపిస్తున్నారూ అంటే, ఈ అందరికీ యెంత బాధ? యెలా వుంటుంది నమ్మకం? 'లెఖ్ఖ' అన్న తర్వాత తప్పులుండవలసిందే! అలా పడిన తప్పులకి మీమీ కాతాలలో యెంతెంత ఖర్చుపద్దులు రాసుకున్నారో చూసుకోవలసిన అవసరం కూడా కనపడుతుంది "

ఆ సమయానికి యమధర్మరాజు గారి కుడిచెయ్యి మీసంమీదికి పోయింది; అన్నారు:

"చూడండి పంతులుగారూ! మా దివాణంలోకి మీరు రావలిసిందే! మీరు గొప్ప ఎకౌంటెంట్లు...అందులో చాలా చాలా నిఖార్సయినవారు. ఎవడో పరాయి విరోధిగాడి ఎకౌంటు సరిచూస్తున్నప్పుడు కూడా - వాడికి వెళ్ళవలసిన అణాపైసలు

# 'యమధర్మరాజుగారు నమిలిమ్రింగిన తలకపిండి'

అక్షరాలా – వాడు కనీవినీ యెరగని అంశా అలో కూడా – క్రమంగా వంచిపెట్టిన మీ పరపతి మా లోకంలో ఘనంగా ప్రతిధ్వనించింది. మా పరిజనులంతా మీకు స్వాగత ప్రవచనాలు చదువుతారు. మా చిత్రగుప్తుడుగారికి డెప్యూటీగా మిమ్మల్ని–"

"అంత ఉద్యోగం యెందుకండీ నాకు – భరించొద్దూ? సిగరెట్లూ సినీమాలూ ఉండవు కద! ఏదో కాఫీ గత్రప్రాణిని. ఇలా గిలగిల కొట్టుకుంటూ చావనియ్యండి. కాశీయాత్ర కెళ్లిన మా సీతన్నగార్ని తీసుకెళ్లండి... వారూ ఆ ఉద్యోగానికి తగ్గ ఉజ్జీ..దిట్ట.."

పెదవి విరుస్తూ చిత్రగుప్తుడు: "సీతయ్య లెక్క నుప్తా అయ్యేసరికి ఇంకా చాలా కాలం పడుతుంది. ఎగవేసిన టాక్సు మూడులక్షలు. అది వదిలక్షలయ్యేదాకా వెలుగుతాడు. రోజుకు పాతికమంది బ్రాహ్మణ భోజనం పెడితే మాత్రం? ఒక దేవాలయాన్ని నిర్మిస్తేమాత్రం? దానికదే —దీనికదే! మేం దిగిరానవసరం లేదు. అతనే మా దగ్గరికి వస్తాడు–ఇంతకీ అది వేరే కథ!"

తను ఓవంక అతి ముఖ్యవ్యవహారం మాట్లాడుతోంటే అడ్డువచ్చిన చిత్రగుప్తుడు మీద రాజావారు రవంత చిరాకు వ్యక్త పరుస్తూ అన్నారు—

"క్వాలిఫయిడ్ ఎక్కౌంటెంట్లు మా దివాణంలో సగంపైగా వున్నారు. మంతీసురువల్లే జనాభాలో మంచివాళ్ల నందర్నీ ఎక్కౌంట్సు డిపార్టుమెంటుకు అప్లై చేసుకుంటాం. మంచి జీతనాలు, వసతి సౌఖ్యాలు – భత్యం–అతి చక్కటి వసుపాయాలూ..." రాజాగారు ఒకవిధమైన ఆనంద లహరిలో తేలిపోసాగేరు. "ఎక్కౌంటెంట్లంతా మొత్తం ఎందరుంటారో యెరుగుదురా?"

"మహానుభావా! ఊహించుకోగలను... కొన్ని లక్షల మిలటరీ మనుష్యులని లెక్క కట్టేటందుకే కొన్ని వేల మిలటరీ ఎక్కౌంటెంట్లుంటున్నారు. వాళ్లూ వీళ్లూ కలిసి వంతమంది మీకు గుమాస్తాల సైన్యం వుండవచ్చు; వారంతా వేరే ఎక్కవుంట్సు మహానగరాలలో కాపురం చేస్తూ వుండవచ్చు. ఇందులో స్వార్థపరులు, పరార్థపరులు, ప్రేమపిచ్చివాళ్లు, భార్యల చివాట్లు తినుదార్లు అనేకులు! నే ననుభవిస్తున్నాను గదా! ఎవడో అపస్మారంలో వున్న ఓ గుమాస్తాగాడి చైత్య వికారానికి లెక్క జెవడి తొంపో మునిగిపోతుందీ—అని నా గోల!"

"ఎన్నటికీ జరగదు." చిత్రగుప్తుడు బల్ల గుద్ది చెప్పసాగేడు. "జరగలేదు – జరగబోదు...ఒక తప్పు కాదు; పావు తప్పు కూడా ఇంతవరకూ జరగలేదు—"

"మీ కెలా తెలుసు?"

"తెలుసు కాబట్టే – అన్ని కాతాలూ నే స్వయంగా రోజూ చూసుకుంటూ వుంటానని తల మొత్తుకుంటూంటే—"

"తోటకూర! స్వయంగా చూసుకుంటాట్ట! పేజీలు ఒక్కసారి తిరగవేసేసరికే యెనమండుగురు చిత్రగుప్తులు మారతారు – వద్దనిమిది మన్వంతరాలు కదిలిపోతాయి–"

యమధర్మరాజుగారు సర్ది చెప్పసాగేరు: "వారికి ఆ ప్రత్యేక పవర్స్ ప్రసాదింపబడ్డాయండి... రేపు మీరే చిత్రగుప్తుడుగా ప్రొమోటయినా..."

"నే నమ్మలేనండి...మీ లోకంలోని జనాభాకంతకీ మూల పుసాదులనూ. మూల విగ్గట్టులనూ మేము. అక్కడికి ఎగుమతీ అంతా ఇక్కడనుంచే—ఈ మనుష్యుల తత్వాలు పూర్తిగా నేనెరుగుదును. అల్లాంటి ప్రసాదాలు రోజుకు డజనుసార్లు తినే మహానుభావులే ముందుగా మీ లోకానికి టిక్కట్టు లేకుండా తయారు..."

చిత్రగుప్తుడు ఏదో పెద్దగా అరవబోయాడు.

"ఆక్టే అరవకండి" అన్నాను. "లెక్క చూపమని అడిగినవాడు లేడు. మీ రన్న మాటల్లా ఇన్నాళ్ళూ నెగ్గుతోంది" నాకు కోపం ఆగింది కాదు. రాజాగారికేసి తిరిగేను: "మీ యిద్దరి కాతాలూ ఒక్కసారి చూడాలని వుంది. మీ యిద్దరి పరిస్థితులూ ఎల్లా వున్నాయో తెలియాలి. లేదూ— మీ బ్యాంకి రిఫరెన్సివ్వండి..."

"... ..........."

"ఇందాకా మనం తగాదా పడిన వ్యవహారంలోని ఆ ముగ్గురుమనుష్యుల కాతాలూ తియ్యండి –"

"ఆ కాతాలు ఈ పుస్తకాల్లో లేవు: ఒకావిడ బెజవాడది. ఇద్దరు రీప్పూరివాళ్లు –"

"నేనీవూళ్లో నే కావుంట! నా కాతా పక్కనే – కనీసం పది పేజీలలో ఇటో – ఆ యిద్దరి కాతాలూ వుండాలి?"

నా తెలివితేటలకి సంతోషించినట్లు చిరునవ్వుతో చిత్రగుప్తుడన్నాడు: "మీరు రాజమండ్రీ 'సి' లెడ్జరులో వుండేవారు. దరిమిలాని 'బి' లెడ్జరులోకి అప్లై వడారు –"

"అటుతర్వాత తమరు తలకాయ వగల కొట్టుకున్నారు?" అన్నారు జహా కోపంతో. "ధర్మరాజుగారూ! మీరు పేరు మార్చుకోవలసిందే..."

ఆయన ముఖంకేసి వింతగా జాలిగా చూస్తూ అన్నాను: "పెద్ద సందేహం ఒకటి నన్ను కొరుక్కుతినేస్తోంది ... నిన్నటి నుంచి అనుకుంటూనే వున్నా – నాలిక దాకా వస్తుంది; వీడు హద్దుపద్దులు దాటిపోతున్నాడేమో అని అనుకుంటారేమోనని ఇదయి వూరుకుంటున్నా..."

రాజాగారు చెవులు రెండింతలు చేసుకున్నారు. చిత్రగుప్తులు వైకల్పికంగా ముఖకళవళికలు నిలుపుకున్నారు.

"ఎన్ని నోములు నోచుకున్నానో! ఎన్ని పుణ్యాలు చేసుకున్నానో! ఈ దిక్కుమాలినజీవితంలో కాకపోతే గతించిన – అనుస్మృతంగావస్తున్న అవతారపరంపరలో ...ఎక్కడో ఎప్పుడో..."

శ్రీవారి ముఖాన సౌమ్యదరహాసచంద్రిక విస్తరిల్లుతోంది. చిత్రగుప్తుడు పళ్లు నములుకుంటున్నాడు – వీలైనంత త్వరలో ఇతను ఓ దంతవైద్యుణ్ణిచూస్తే మంచిది – లోకోపకారం కోసం ... దంతస్వాధున్నవాడు ఎదుటి హృదయాన్ని స్వర్గంచేసుకోగలిగే సానుభూతిచక్రంలో వుండడు.

"పరమ వేదమూర్తులు – న్యాయ ధర్మప్రభువులు – సర్వలోకజీవన శాసకరలు అయిన మీ దర్శనభాగ్యం అబ్బింది; మీ మంత్రివర్యులసమేతంగా ... మీ దివాణంలోని కొంత రికార్డు సహితంగా ... ఎన్ని పురాణాలు తిరగవేసినా ఇటువంటిఅదృష్టం పట్టిన నరులు – వేళ్లమీద లెక్క పెట్టవచ్చునేమో!"

యమధర్మరాజుగారు రడీగా వున్నారు – నే నడగడమే తడవుగా వరాలిచ్చెయ్యడానికి; ఆ వరప్రగ్రహించేకాబోలు చిత్రగుప్తుడు కేవలం తనకాళ్లతో మాత్రం భరతనాట్యం చేస్తున్నట్లగపడుతున్నాడు.

"స్వయంగా – ఏకాయకీని – నరకపురీ రాజధానినుండి శ్రీ యమధర్మరాజావారే విచ్చేశా రెందుచేతనో ? ఈ మామూలు కాగితపు మనిషి ప్రాణిగాడిని తీసుకపోడానికి! భటుల్లేరూ? కింకరులు!! అతి భయంకరులు!!!"

రాజాగారి ప్రసన్న తేజస్సు కాస్తా తక్షణ కారిగిపోయింది. ముందే డొక్కట్టింది కాబోలు. నాలిక దులుపు కున్నారు. పెదిమలు తడుపుకున్నారు.

తెలుగు పద్యం వప్పగించలేని బడిపిల్ల కాయమాదిరి చూపులు చిత్రగుప్తుడు కేసి పోనిస్తూ, మెల్లగా వదిలేరు: "మీరు మహా ఘట్టిపిండం అనీ, గలభా చేసేరకం అనీ, నేను 'పర్సనల్' గా కలగజేసుకోవాల్సిన వ్యవహారమనీ ఈయనగారు నా డైరీలో రాసివుంచారు..."

"అల్లా అపహారించండి స్వామీ!" నా కోపం చిరునవ్వుగా మారింది; ఏమ

వాలో నాకే తెలిసిందికాదు. జాలికూడా వేసింది. "ఇంత అమాయకుడివి - ఎల్లా కాపరం చేస్తున్నావయ్యా?"

అతి మర్యాదగా మాట్లాడసాగేను-"ఇదే కూడిరి పర్సనల్ వ్యవహారం ఈ భూలోకం గాళ్ళతో ఈమధ్య ఎప్పుడేనా తటస్థ పడిందా మీకు?...ఓ వందసంవత్సరాలలో ...పోనీ ఓ వెయ్యిసంవత్సరాలలో...లేద న్నట్లే కదా ?...అర్థంకావడం లేదూ ? తప్పుల తడకల లెక్కలు తయారయ్యాయి; అది ఈయనకి తెలుసు. సరిదిద్దించడానికి తీరిక లేదు అందాం...అశ్రద్ధ - పెళ్లాంమీద కోపం...అవన్నీ వేరేవుంచండి. లెక్కలు తయారయ్యేయ్. వ్యవహారం చేతులు దాటి పోయింది...అది కాస్తా బయటపడకుండా వుండడానికి మీ చేత్తోనే ఇన్ని అక్షింతలు వేయించెయ్యడానికి వేసిన ప్లాను... ఈ మహానుభావుడు!"

అంటూ ఒక్క చూపులబాణం విసిరేను- చిత్రగుప్తుడికేసి—

దానిధాటికి ఉలిక్కిపడ్డాడు...కూలి పోయాడు...

యమధర్మరాజుగారు కరడు కట్టుకు పోయినట్లయ్యారు. ఏదో గబగబా జపం చేసుకుంటూ, కంగారుతో గది వాకిలి వంక దృష్టులు పోనిస్తున్నారు; వారి చక్కని 'గంభీర' మీసాలు నీళ్లు గారిపోతున్నట్లు వేళ్లాడిపోతున్నాయి...

ఏదో అయ్యింది...పిడుగు పడిందేమో! పెనువెల్లువ ఉబికి విరుచుకుపడుతోంది...జనసమ్మర్దం... కోలాహలం ... అరుపులు...నినాదాలు...

* * *

పదిపదిహేనుగురు ఋషిపుంగవులు - దూర్వాసులూ - విశ్వామిత్రవర్యులూ - (తోసుకుంటూ - శాపాలు ధారపోసే ముఖ కమండలాలతో ఒక్కుమ్మడి నా గదిలోకి ముంచుకు వచ్చేరు:

వాళ్లంతా 'సినీమా కోరస్' లాగ ఒక్కసారి అరుస్తున్నారు. వీధిభాగోతం కనీకన పడని (పేక్షకుల కలకలం నేనయి వున్నాను. దూరంగా చూద్దునుకదా కిటికీలోంచి పెల్లుబుకుతున్న జనసమూహాలు కనపడుతున్నాయి.

నన్ను చూసో - నా అతిథుల్ని చూసో- పద్ధణగుతోంది. ముందున్న వాళ్లనంతా చీల్చి చెండాడుకుంటూ ఒక కపిలుడు "యమరిదయ్యా యీ దున్నపోతు?" అంటూ గద్దించసాగేడు పెద్దగా. "యమర్దంట??"

ఆ గొంతు - జీవనమరణ మీమాంసలో పడి గిలగిల కొట్టుకుంటున్న వరాహమూర్తి తాలూకు అనిపించింది. అటయితే - దాని ఆసామీ స్వయంగా మా రాములుశెట్టి శాగ స్వామి వున్నయ్య(శేష్ఠిగారిదే! అతని నడుంమీద వాళ్లి మిల్లు పొగగొట్టం విరుచుకు పడిందేమో-పాపం.

మళ్ళీ అతని రొలుగు నలుదిశలా మారు (మోగించేది. నాకేమీ అర్థమవడంలేదు. నా అతిథులవేపు చూశాను. వారిద్దరూ ముఖాలు చూసుకున్నారు. ఇప్పుడు చేతి గోళ్లు మాసుకుంటున్నారు.

"కొంప ముంచేసిందండీ దున్న..." నన్ను గుర్తుపట్టిన వున్నయ్య ఎలుగెత్తి విశ్చేస్తున్నాడు; సంగతి సందర్భాలన్నీ వివరంగా చెప్పడానికిగాను ఆమాత్రం అనగలిగేడు.

ఆవరణలోంచి ఏవో కొత్త నినాదాలు బయలుదేరేయి. రాములు కంఠం కూడా వినపడుతోంది. పదిమంది పదిస్వరాల వచనలు వల్లిస్తున్నారు. జనాన్ని తోసుకుంటూ లోపలికి వస్తున్న రాములు—

"ముందు దున్నని కట్టెయ్యం(డా-నిలువునా కట్టెయ్యండి..." అంటూ పరిజనానికి ఆర్డరిచ్చేడు.

నాకేసి చూస్తూ వున్నయ్య "మాశండి ఆ దున్న-" అని గొల్లుమనబోయాడు.

"చూసేదేముంది? దున్నంటే యరగడా పంతులు?" రాములు సమాధానం. "రెండు బారల కొమ్ముల తాటిపట్టే మెహాపు మొద్దవతారం...ఓ...దానికేం? షోగ్గా నెమరేస్తో వాకిట్లో కావిలి కాస్తోంది!"

కిటికీదాకా వెళ్ళి మహోత్సవ సౌందర్యం కన్నులారా చూద్దామనే అభిలాషతో, ఎల్లాగో వోపిక చేసుకుని లేచి నిలబడ్డాను. ఎవరో నలుగురు నన్ను బలవంతంగా నేలకు అదిమిపట్టుకుంటున్నట్లనిపించింది. ఉత్సాహంమీద వచ్చిన బలంతో వారిని (పక్కకునెట్టి రెండడుగులువేసి కిటికీలోంచి చూద్దునుకదా—

(శ్రీ దున్నగారు నిగనిగలాడుతూ, తమ నిశాచర స్వరూపానికి జడత్వమారోపించుకుని ఒక మబ్బుకొండలా నిలుచుని వున్నారు: (క్రీగంట మనుష్యులందర్నీ వీక్షిస్తున్నారు-ఈ గొడవలు తమ కేమాత్రం సంబంధించనట్లు; తమ స్వరూప మిక్కడ లేనేలేనట్లు!

"యమవరిదంట?"

అప్పటికి మళ్ళీ మంచంమీద కూలబడ్డాను. (పశ్నకు సమాధానం చెప్పినది నేను:

"వున్నయ్యగారూ! అది ఈ (బాహ్మణుగారిది! ఆ దున్నగారిని మీరు స్వయంగా ఎక్కి దిగివచ్చారు...పాపం! అందుకనే తన యజమాని వున్న స్థలానికి వచ్చి నిలబడి పోయి నెమరువేస్తోంది—"

వున్నయ్య కోపం ఎగిరిపోయి వెటకారంలోకి దిగింది.

"ధళే దున్న సవారీయే!...మోటార్లు లేవా సైకిళ్లు లేవా—బండి కట్టుకు రాక పోయావా?...పోనీ గాడిదమీదేనా దిగక పోయావా దొరా? దొరగ్గా దొరగ్గా దున్న దొరికిందా సాములోరూ మా కొంప తీకడానికీ—" అని ముక్తాయింపులు పాడేడు:

"దున్నని కట్టేసుకోకపోయావ్ టయ్యా??" అని ఎవరో అనుపల్లవి అందుకున్నారు.

ఆ వర్షానికి తల వంచుకున్నారు ధర్మరాజుగారు.

"దాని శిఖతరగా—" ఇక చరణాలు పూర్తిచేయసాగేడు రాములు, "ఇదేం దున్నండీ పంతులు...అసలు దానికి దానా పడేస్తున్నాడో లేదో...మా కొంప కూలి పోతే...నాలుగు వందల ముప్ఫై నాలుగున్నర *శెనగపిట్టు బస్తాలూ మటుమాయం చేసిందండీ..." (* శెనగపిండి: వేరుశెనగ తెలకపిండి.)

అంటూ (పారంభించి వరస వరసలుగా గొల్లున ఆలాపన చేశాడు.

* * *

కథంతా నాకర్థమయింది. వ్యాఖ్యానం నలుగురికీ తెలియ చెప్పసాగేను:

"అది స్వయాన యమధర్మరాజుగారి వాహనం. దాని మొండిగోడవీపుమీదనే ధర్మదేవత సింహాసనం. దానికి అడ్డేమిటి? తిరుగేమిటి??

"ఎన్నో జన్మల ఎంతెంతో పుణ్యం చేసుకుని అది దేవలోకంలో దున్నగారై పుట్టింది...కానైతే జాతికి అసలైన నిసలైన దున్నపోతు. మన మామూలు దున్నలు చేసే (పతి పనీ అమానుషంగా, విపరీతంగా - చేయగలదు.

"దాని బుద్ధి బహు సూక్ష్మం. దానికి తోడు రవంత దూరదృష్టి కూడా వుంటుందేమో!

"యమరాజుగారు నా దగ్గిర పీఠం వేసుక్కూచున్నారు. ఎంతకీ తెముల్చని వ్యవహారంలో ఇరుక్కుపోయారు. ఎంతసేపని కాళ్లమీద గరుడసేవ చేస్తూ నిలబడి వుంటుంది? అందులోనూ రాకరాక ఎంతకాలానికో ఈలోకానికి వచ్చింది ... చిన్ని షికారు తియ్యాలనుకుంది...

"ఒక్కసారి తలాతోకా ఆడించేసరికి - దగ్గరేవున్న మీ వేరుశెనగఫ్యాక్టరీ - గోడవున్లలో పకోడీలలా ఘుమఘుములాడుతూ పడివున్న తెలకపిండిగుట్టలూ వాసన పట్టింది. జిహ్వాచాపల్యం. ఎన్నాళ్లయిందో యేమో! ముక్కుపుటాలు ఎగరవేసింది; నాలిక పీక్కసాగింది...

(22-వ పేజీ చూడండి)



పల్లెవాడు

# 'యమధర్మరాజుగారు నమిలిమింగిన తెలకపిండి'

"అలా అలా షికారు బయలుదేరింది. మీరు చూసుకోలేదు. గోడవున్నలో ఉరికింది. పని ప్రారంభించింది.

"అయిదుగంటలయ్యేసరికి ఫ్యాక్టరీకి తాళాలేసుకున్నారు. లోపల దున్నగారున్నార నే సంగతి చూసుగోకుండా తలుపులు బిగించేసుకున్నారు - మా గుమాస్తాలు.

"ఇంకేముంది? పిట్టు గుట్టలు కొస్తా ఉన్నాని ఊదేసింది. తలుపులు బిగించున్నాయి. ఎంతచెడినా దేవతాదున్నలకి రాజా. లోపల చిక్కడిపోయింది. ఓవంక టయిమయిపోతోంది. మర్యాదా కోసం మానం చంపుకుంటుందా? గోడ పగలకొట్టుకొచ్చేస్తోంటే మీరంతా చూసి, పోలోమని దానికెనకాల పడ్డారు..."

కథ ముగించేను. ఒక్కనిముషం విస్మయంతో ఎవరూ మాట్లాడలేదు. పున్నయ్య కిటికీదగ్గర కూలపడిపోయాడు. తన రెండు చేతులూ నెత్తిమీద బోర్లించుకున్నాడు...

"యవరుబాబు యీయన్న?" ఒక జీతగాడి బాధ. "యమరాజుగోరా? మరి కాదన్నావేటుండి?"

"యమధర్మరాజు?!" సగం కథలో వచ్చిన నారాయణ తన పళ్లన్నిటినీ ఒక్కసారి బయటకు పారేశాడు, "నోట్లో కోరల్లేవేం? చేతులో మోకుతాడు లేదేం?" అంటూ నవ్వబోయాడు.

"ఓ యమరాజుగోరో! కొంప ముంచినావుండోయ్ -" అంటూ ఇంకో ఫ్యాక్టరీ జీతగాడు ఆయనకి సాష్టాంగం పడ్డాడు: లబలబమన్నాడు. "నా పానాలు పోతుండాయ్. బాబూ - రచ్చింపించండి...నా పెల్లాం యెంకడితో లేచిపోయిందుండి..."

అందరూ నవ్వబోయిభయపడ్డారు. యమధర్మరాజాగారుమాత్రం ఇవేమీ పాటించుకోక తమ అరచేతుల సౌభాగ్యాన్ని తిలకిస్తున్నారు.

ఇక గత్యంతరంలేక పున్నయ్యగారు పుత్రశోకం ప్రారంభించేరు -

"మామూలు దున్నపోతుల్లోకే కొంపలు గుండమైపోతుంటే ఈ దేవతాదున్నలు కూడా దాపరించాయేంరా దేవుడా..."

"దానేం తప్పు? యమధర్మరాజుగారితో అదీ వొచ్చింది. ఆకలేసింది. తింది..." అని ఓ గుమాస్తా సమర్థించేడు.

"ఒక్క యమధర్మరాజాగారే కాదు చిత్రగుప్తులవారుకూడా వెంచేశారు -" అన్నాను.

"ఆరు దేనిమీదెక్కి వొచ్చినారంట?"

ఈ ప్రశ్నకి సమాధానం వచ్చేలోగానే వేరోక జీతగాడు అందుకున్నాడు:

"సిత్రగుప్తులుగోరుకూడా సొయంగా వొచ్చినారేటుండి? మా అమ్మనోం కూడా సేసిందుండి...యంత జమకట్టించిందో! ఐదు పదులిత్తనాలు కర్చయిపాయుండి... సిత్తగించాలి పంతులుగోరు... కొంత రికిమిండు సేపించాలుండి..."

మా రాములు కొత్తసేపు గోళ్లు గిల్లుకున్నాడు. నాకేసి తిరిగి వ్యథపడసాగేడు. అతని బాధ చూడలేక నేను మెల్లగా నడుం వాల్చేను—

"పంతులుగారూ! యేం చెయ్యమంటారు? మీరు యరగనిదికాదు...ఇంతవరకూ మా లెక్కలలో నూటయిరవైయారు బస్తాలే పిట్టు నిల్వ చూపిస్తున్నాం; మిగిలినవన్నీ బ్లాకువి: లెక్కప్రకారం వ్యవసాయం డిపార్టిమెంటు వారిచ్చే పర్మిట్లకి ఆ స్టాకు నిల్వ విడుదలచెయ్యవలసిందే!..."

నే కళ్లుమూసుకుని వింటున్నా - ఎరిగున్న వ్యవహారమే అయినా. "ఈ బ్లాకు మార్కెట్టు పిట్టు లెక్కలు వేరేరాసుకుని యే నెల కా నెల భాగస్తులం పంచుకుంటున్నాం...మొత్తం కోటిస్వామితో కలిసి ఆరుగురం భాగస్తులం...వీళ్లందరికీ యేంచెప్పను? వ్యవసాయం డిపార్టిమెంటు కెలాగ? లెక్కలా చెపతా? పర్మిట్లకి డెలివరీ ఎక్కణ్నించిస్తా? వారంట్లు...సంజాయిషీలు...లంచాలు...నూలాభాలు గూబల్లోకొచ్చేయ్...కంపెనీ దివాళా...!"

"జరిగిన సంగతంతా చెపితే?"

"ఓరి పిచ్చినాయనా! యవడు నమ్మతాడా? పున్నయ్యొక్కడున్నాడు కాబట్టి పలకడు...మన మిగిలిన భాగస్వాములే నవ్వుతారుకదరా! సొమ్మపోయిందిపోగా నవ్వులపాలా?? బతుకు!! ఓ వంక పగిలిపోయిన గోడవును గోడ రిపేరు చేయించుకోవాలె—"

రాములు కడుపులో రగులుకు రగులుకు వస్తున్న అగ్నిపర్వతం బద్దలైపోయింది.

"బస్తా ఒక్కంటికి అయిదురూపాయలందిపుచ్చుకుంటేనేగాని ఆసామీకి డిపార్టిమెంటు దగ్గిర్నించి పర్మిట్టు రాదు. * కంట్రోలు రేటుకి రూపాయకంటే యెక్కువ పుచ్చుకోడం లేదు మేం. స్టాకు నిల్వ తేడా వుందీ అంటే ఫైను..... బంట్రోతుగారిదగ్గిర్నించీ చేతులు తడపాల్సిందే. కనక్కాయధర గిరాకీ. లెక్కల బనాయింపుకి మాత్రం మిల్లు ఎనిమిదిగంటలే పనిచేస్తుంది. లోపాయికారిగా రాత్రిళ్లు ఇంకో అయిదారు గంటలు కమూత్రి పడుతున్నాం - గంటకి పది రూపాయలు వాళ్ళ యెదాన్న పోసి...ఇంకేం వుంది... వ్యాపారం గిపారం మూసేసి రంగనాయకులు సెట్టిలా కాశిలో దూకాల్సిందే!"

(* తెలకపిండి రైతులు ఎరువుగా ఉపయోగిస్తారు. దీనిమీద కంట్రోలు 1945 ఆ ప్రాంతంనించీ కొన్ని సంవత్సరాలు వ్యవసాయం డిపార్టిమెంటు చేతిలో వుండేది.)

ఇంతవరకూ ముంచుకొచ్చిన తర్వాత నే నూరుకోలేకపోయాను:

"అయితే గుప్తాగారూ! ఇప్పుడు మా రాములు శెట్టికి జరిగిన ఈ ఘోర కాండ అంతా స్వయంగా తిలకించారుకదా? ఈ కాండని ఎవరెవరికి ఎంతెంత చొప్పున యేవిధంగా పంచుతారో—అందులో మీరూ మీ రాజాగారూ మీ దున్నగారూ యెంతెంత తినగలరో - ఈ నష్టాన్ని మా రాముల్ని ఏవిధంగా భర్తీచేసుకోమంటారో—మీమీ లెక్కల్లో ఎంట్రీలు ఏవిధంగా రాస్తారో చూడాలి...మాట్లాడరేం?" తల పైకెత్తుతూ అడిగేను "ఏరీ? చిత్రగుప్తుడుగారూ!"

చిత్రగుప్తు డక్కడ లేడు!

"వరండాలో చూడండి..."

నలుగురూ ఆయనకోసం వెతకసాగేరు. ఎవరో అన్నారు: "యిందాకా యిలా వెళ్ళిన పిలకశెట్టిగారేనా?"

పుస్తకాలూ లేవు - ఊహాయించేను, సందు చూసుకుని...చీకటిచాటు కే!

నాకు ఆశ్చర్యంవెయ్యసాగింది. ఎంతెంత మనుష్యులయితే నేమి? చివరకు అంతే! మా పరిజనమంతా ఆవరణ గాలిస్తున్నారు కాబోలు.

ఇన్ని లంఖణాలమీదట ఈ గోల నాకు చాలా నీరసం తెచ్చింది. యమధర్మరాజుగారేమంటారో వినాలని వుంది. నిమీలితనేత్రాలతో పడుకునివున్నా.

నా చెవుదగ్గిర ఏదో సవ్వడి...కళ్లు తెరిచా...రాజాగారు కిటికీలోంచి బయటికి దూకుతున్నారు. లేవబోయాను - నా చెయ్యి ఎవరో గట్టిగా పట్టుకున్నారు. విదుల్చుకోబోయా - ఇంకొకరు నన్ను కదలనియ్యలేదు.

విసుకొచ్చి కళ్లు మూసుకున్నా...

శంకరయ్య మాటలు: "ఇంక ఫరవాలేదు...మనిషి తేరుకుంటున్నాడు..."

కొంతసేపటికి రాములు మాటలు—"నారాయణా! నిన్న సాయంకాలం వొచ్చినట్టున్నాడు—ఆ బ్రాహ్మణ నిడమానూరాయన—వెళ్లినట్టేనా?"

"అతని పంచీ బుట్టా తీసుకుపోయాడు - ఓ గంటయింది!"

నా చెయ్యి వదలి శంకరయ్య సంతోషిస్తున్నాడు: "లంఘౌషధాలు - మంచివి - వెంటనే గుణం కనపడింది...."

నే మాట్లాడకుండా వుండలేకపోయాను: "ఇదంతా—దున్నపోతుగారి తెలకపిండి!"



# సందేశం

ఎంత తెలివున్నా, చదువున్నా, డబ్బుంటే గానీ జరగదు జీవితం. 'ఎలాగైనా డబ్బు సంపాదిద్దాం' అని చూచాను లోకంలోకి. ఎవరిమట్టుకు వారే వెళ్ళిపోతున్నా రెక్కడికో. పక్కనున్న నన్ను చూచీ చూడనట్లే పోతున్నారు. తల బాగా పైకెత్తి చూచాను లోకంలోకి. నాలాంటి వారెందరో చదువుకున్న పెద్ద వాళ్లు, చినిగిన చొక్కాలవాళ్ళు, మాసిన గడ్డాలవాళ్లు తల వంచుకొని ఏదో చేస్తున్నారు. "ఏమిటయ్యా చేసేది?" అన్నానొక మిత్రుణ్ణి. అతనే లోకంలో ఉన్నాడో, కదలేదు, మెదల్లేదు; కన్నెత్తి చూడలేదు. కదిలించినా కదలని మనిషి, పిలిచినా పలకని మనిషి, చచ్చినవాడితో సమానమేగా! ఏమిటి వాడు చేసేదని, అట్టే చూచాను; మరీ మరీ అడిగాను; "S వెయ్యాలా, M వెయ్యాలా" అన్నాడు. పెద్ద పెద్ద అక్షరాల్లో కనిపించాయి కమ్మని మాటలు: 'అంతా మీదే గెలవండి; రూపాయతో లక్షా యాభై వేలు; మీరే గెలవండి. అంతా మీదేనండి!' ఆహాహా! ఎంత తియ్యనిమాటలు! రసగుల్లా మామిడిపండులా, చక్కెరకేళీ అరటి పండులా, బలే తియ్యగా ఉన్నాయి. ఎవరో ఆ మహానుభావుడు? ఎందరో మహానుభావులు! ఉంటారు లోకంలో కొందరు; రూపాయకు లక్షాయాభైవేలిచ్చే దానకర్ణులుంటారు! భారత భాగవతాల్లో, రామాయణాది గ్రంథాల్లో, అటువంటి దానకర్ణుణ్ణే కనిపించలేదు నా కళ్లకు. ఎందుకు, అందరూ చేశారు దేశసేవ. సత్యాగ్రహ సమరాల్లో, విప్లవోద్యమాలలో, మంటలలో మాడి మసి, నుసి అయిపోయారు, మనుషులు మరిచిపోయారు వాళ్లని. ఏం లాభం! ఏం లాభం! వాళ్లు చచ్చి మాత్రం ఏం లాభం! పాపం ఈ మహానుభావు డెవ్వరో, దేవాంశ సంభూతుడు. రూపాయకు లక్షాయాభైవేలిస్తాడు. వంద సార్లు భుజంతట్టి లేపానొక మిత్రుణ్ణి. అతను మేలుకొనే ఉన్నాడు. కాని నిద్రపోతూ ఉన్నాడు. తాను నిద్రపోతూ ఉన్నాడో మేలుకొనే ఉన్నాడో, తనకే తెలియని స్థితిలో ఉన్నాడు. అయ్యో! ఏంచేసేది నేను! నా మిత్రుడు పిచ్చివాడైపోయాడా! "ఎందుకురా అలా చూస్తావ్!" అని దీనంగా అడిగాను. "S వెయ్యాలా, M వెయ్యాలా" అన్నాడు.

నేనూ కొంచెం ఆలోచించి "M వెయ్యరా సరిపోతుంది" అని అన్నానో ఇంకాలేదో! "కాదు అక్కడ S ఉండాలి" అని వంద మంది అరిచారు. "కాదు M ఉండాలి" అని లక్ష గొంతులు అరిచాయి. "కాదు S ఉండాలి" అని పదిలక్షల గొంతులు. S కూ, M కూ మధ్య హోరాహోరీ పోరాటం. రక్తం చెమటగా మారిపోతూ ఉంది. నా మిత్రులు లక్షలు లక్షలు, నా మనోనేత్రం ముందు కనిపించారు. S కూ, M కూ B కి, D కి జరిగే సమరంలో, అలిసిపోయి ఒరిగిపోతున్నారు. కట్టుకున్న గాలిమేడలు కూలిపోయి నిరాశతో కుంగిపోతున్నారు. మెదడంతా వేడెక్కి కరిగి నీరై ప్రవహిస్తోంది. స్వార్థపరులు సృష్టించిన సుడిగుండంలో దూకి, నా మిత్రులు గిరగిర తిరుగుతూ, కొట్టుకొనిపోతూ, లక్షలు లక్షలొస్తాయని, కంటున్నారు కలలు.

## జి. సి. రామకృష్ణ

ప్రవాహంలో పడి దిక్కు తెలియక, కొట్టుకొనిపోతున్నా రెక్కడికో. ధనంకోసం ఆశపడి, మనం మనుషులమని మరచిపోయి, పిచ్చివాళ్ళయిపోయే అమాయకపు మిత్రులారా! దరిద్రంతో నలిగిపోతూ, అద్దంలో కనిపించే ధనరాసులకోసం ఆశిస్తే ఏంలాభం ఏంలాభం! మీరు అద్దంలో డబ్బుమూట చూస్తూనే ఉంటారు. వెనకనే ఎవడో వచ్చి, డబ్బుమూట లాక్కుంటాడు. అద్దంలో మూటకూడా అదృశ్యమయిపోతుంది. నీకు మిగిలే దొక్కటే తెలుసుకో: అది నీ గాయపడిన హృదయమే. అంతకన్నా నీకేమీ మిగలదు. ఏ అక్షరం వేస్తే లక్షరూకలొస్తాయా అని, తపించే బదులు నీచుట్టూ ఇలా ఎందుకుందని, ఎన్నడైనా ఆలోచించావా? ఇదిగో నా సందేశం! నా చేయి నీకందిస్తున్నాను. సుడిగుండంలో కొట్టుకపోతూ, మునకే సుఖమనుకొన్నావా? బయటపడడం నీకిష్టం లేదా? నీవు మునగడం నా కిష్టంలేదు. మునిగితే బాపూజీలా, శ్రీరాములుల్లా, భగత్ సింగ్ లా మునగాలి. రూకలకోసం మునగలేదు వాళ్లు. లోకం యిలా ఎందుకుందన్నారు? మార్చి పారెయ్యాలన్నారు. మార్చడంలోనే మహానిర్యాణం చెందారు. అయ్యయ్యో! చావలేదు వాళ్ళు. ఇంకా మనలో ఉన్నారు, మనకోసం వీచుస్తున్నారు. ఒక రూకతో పదిలక్షల రూకలు చెయ్యాలని కాదూ నీ దురాశ? డబ్బును ప్రేమించే మనిషి మనుషుల్నెలా ప్రేమిస్తాడోయ్ భాయీ! నాకూ డబ్బంటే చాలా యిష్టం; కమ్మగా కాఫీ తాగొచ్చు; కడుపునిండా తినవచ్చు; నా పాపకు చొక్కా తేవచ్చు; ప్రియురాలితో సినిమా చూడొచ్చు, కాని అక్షరాల గారడీలో నలిగి నలిగి సతమతమై, సొమ్మంటేమాత్రం, ఎదురు తిరుగుతాను నేను. చొక్కా మాసిపోతే ఏం, నా పాపడు దేవతలా ఉంటాడు. చీర చినిగిపోతే ఏం, నా ప్రేయసి నా కళ్ళకు ప్రకృతి యిచ్చిన బహుమానంలా, సౌందర్యదేవతలా కనిపిస్తుంది. నేను పోయే దారిలోనే రమ్మంటాను నావాళ్ళందర్నీ. కందుకూరి, గురజాడల అడుగు జాడల్లో, తడబడకుండా నడండి పోదాము. కందుకూరి కలం కత్తిలా మెరిసింది ఆనాడు. కత్తిఝుళిపింపులకు జడిసి, అదిరిపోయారు దొంగలు. పాపం S వెయ్యాలా, M వెయ్యాలా అని ఆలోచించి, ఆలోచించి, అలిసిపోయావు పాపం! అందరం కలిసి ఆలోచిద్దాం. దిక్కులేని పసిపాపలు, 'అయ్యా కానీ బాబూ,' అని అడగనవసరంలేని సమాజం కోసం. దొంగలు సృష్టించిన యినుపచట్రంలో, నీవూ నేనూ, నలిగి నాశనమైపోకుండా, ఉండే భవిష్యత్తుకోసం ఆలోచిద్దాంరా. లోకం బాగుపడాలంటే, నీవూ నేనూ కదలాలి. మర్యాదస్తులు కదలరు మెదలరు. మనకెందుకులే అని పోతుంటారు. అలాంటివాళ్లు లోకంలో ఉండీ ఒకటే, లేకా ఒకటేననుకో. సామాన్యుడి తలకు ఏదోపని కల్పించియిచ్చి, తలవంచి చెయ్యమని చెప్పడం, దొంగలకెప్పుడూ అలవాటే. నిన్న 'పజిల్' చేసి, వెర్రి వెంగళప్పను చేయడంకోసమే వచ్చాయి పజిల్స్. అక్షరాలగారడీమధ్య మన తెలివిని వృథాచేసేకన్నా అందరం కలిసి ఆలోచిస్తే, లక్షల చేతులు కలిశాయంటే, చెదలు పట్టిన సమాజాన్ని దుమ్ముదులిపి, చెదలు విదిపి, శుభ్రంగా చెయ్యొచ్చు. పాతమేడ విరిగిపోయి, పాడుబడిపోతుంటే చూస్తుంటే ఏం లాభం! పాతమేడను బాగైనా చేయాలి. లేక కొత్తమేడ కట్టాలని కృషి అయినా చెయ్యాలి. కొత్త మేడంటే నాకూ యిష్టం. అందరం కలిశామంటే, అందమైన కొత్త మేడ కట్టుకోవచ్చు. అందరికీ సుఖం కలిగించొచ్చు. అక్షరాల గారడీలో పడి అమూల్యమైన బుద్ధిని వ్యర్థం చెయ్యకు. అక్షరాల నింతకంటే లక్షణంగా వినియోగించు. కళ్లు తెరిచి మేలుకొని సమాజాన్ని మార్చేందుకు ఆలోచించు, ఆలోచించు. ★

# దెబ్బతిన్న అహంకారం

"రాధా! నువ్వు నిజంగా వసంత లక్ష్మిలాగా వుంటావు!"

* * *

"రాధా! అందగత్తెనని విర్రవీగిపోతున్నావు...నీ పొగరు అణచేందుకు చిట్టితల్లి పుట్టిందిలే!"

* * *

"రాధా! నువ్వు నా రాణిగా వచ్చినప్పటి నుంచీ ప్రతిరోజూ లేచిన తర్వాత పడుకు బోయేముందు... నేను చాలా అదృష్టవంతుడినని గుర్తు తెచ్చుకుంటూ వుంటాను. నిజముగా నిన్ను చూసి, చిట్టితల్లిని చూసి, నా అదృష్టము చూసి ఎంతమంది యీర్ష్య పడుతున్నారో!"

* * *

రాధ, అందాన్ని వర్ణిస్తూ, రామనాధము తరచు చేసే ప్రశంసలలో యివి కొన్ని మాత్రమే!

రాధ రూపవతి అన్న విషయములో ఎవరికీ అభిప్రాయభేద ముండదు.

తెల్లని దేహచ్ఛాయ గుండ్రని మొగము, విశాలమయిన ఫాలతలమ్ము, గాలికి ఎగిరే ముంగురులు, నొక్కుల నల్లటి దీర్ఘ కుంతలాలు, తీర్చిదిద్దినట్లుండే కనుబొమలు, ప్రకాశవంతమయిన నేత్రద్వయము, కొనదేరిన ముక్కు, నవ్వితే సొట్టబడే గులాబీ రంగు చెక్కిళ్లు, చిన్ని నోరు, గడ్డముమీద చిన్ని పుట్టుమచ్చ. ఈ లక్షణాలన్నీ ఆమె అందాన్ని తెలుపుతాయి.

ఆకుపచ్చ చీర కట్టుకుని గులాబీ రంగు జాకెట్టు తొడుక్కుని, వదులుగా జడ అల్లుకుని, తల్లో పువ్వులు తురుముకుని, కళ్లకి కాటుక పెట్టుకుని, తాంబూలముతో ఎరుపెక్కిన పెదిమలు, గోళ్లకి గోరింటాకు పెట్టుకోవడమువలన ఏర్పడిన ఎరుపుని చూస్తే, నిజముగా అప్పుడే సాక్షాత్కరించిన వసంతలక్ష్మిలాగా, వనదేవతలాగా వుంటుంది.

"రాధని చూసినవారంతా ఆమెని రూపవతి అంటారు!"

"రాధని తెలిసినవారంతా ఆమెని గర్విష్ఠి అంటారు!"

రెండూ నిజమే!

ఆమెకి బుద్ధి తెలిసినప్పటినుంచి తన సౌందర్య ప్రశంసలే వింటూవచ్చింది. అహంకారము, అతిశయము, తప్పు అని వినకముందే ఆమెలో ఆ రెండు గుణాలు, బలముగా పొడుకుపోయాయి.

"రాధకేమండీ! దాని అందము, దాని శుభ్రము ఎవరికి వస్తాయి?" పుణ్యముకొద్దీ పురుషులు. దానముకొద్దీ బిడ్డలు," అని నిట్టూర్చేవారు యిరుగుపొరుగువారు.

## కంచి వాసుదేవరావు

"మా రాధతల్లిని పెళ్ళిచేసుకోవడానికి ఆ శ్రీకృష్ణుడే అవతరించాలి" అనేది అమ్మ.

"ఎంతోమంది పిల్లలు రాధ స్నేహముకోసము పోటీలు పడేవారు."

"మా అమ్మాయికేంలే! అది తన అందముతో ప్రపంచాన్ని జయిస్తుంది" అనేవారు నాన్నగారు.

బడికి వెళ్లడము మొదలెట్టాక....ఏటేటా ఆమెసౌందర్యాన్ని ఆరాధించే విద్యార్థులు బయలుదేరారు...తనని కాలేజీ సుందరిగా పరిగణిస్తున్నారన్న సంగతి...ఆమెకి ఎంతో గర్వకారణమయ్యేది. కాలేజీలో తన అందాన్ని ఆరాధించి, తన హృదయాన్ని వాంఛించి, తనస్నేహాన్ని అభిలషించి, తన ప్రేమను అర్థించే విద్యార్థులసంఖ్య అపరిమితముగా వుండేది.

"ఏమి! రాధా! సినిమాలలో ఛాన్సు దొరకుతుందేమో చూడరాదూ! నువ్వు Field లో కాలుపెడితే యిప్పటివాళ్ళంతా రంగమునించి తప్పుకుంటారు!" అనేది నిర్మల నవ్వుతూ!

నిజమే! కాని రాధ సినిమాలలోకి జేరడానికి వుత్సాహము కనపర్చేదికాదు. తనకు నటించేశక్తివుందని ఆమె ఎన్నడూ భావించలేదు. సినిమాలలో జేరితే నైతిక ప్రమాణాలు దెబ్బతింటాయని విశ్వసించేది. "అది నీ భ్రమమాత్రమే!" అనేది నిర్మల. నిజమే! కాని, ఆ భ్రమకి ఆధారాలు లేకపోలేదు. అప్పుడు తన అందాన్ని ఆరాధించే యువకులసంఖ్య లక్షలలోకి పెరుగుతుంది. తన ఫొటోలు వివిధపోజులతో ఏ కిళ్ళీకొట్టులో చూసినా, ఏ మంగలిషాపులో చూసినా వేళ్ళాడుతూ వుంటాయి. తన ఫొటోలవంక ఎంతమందో వెటకరించి చూస్తూవుంటారు. ఇటువంటిఆరాధన అంటే ఆమెకి జుగుప్స. తన అందము గోడలకెక్కడానికి కాదు.

"ఏమయ్యా! రాధ పెద్దదవుతోంది! ఏమాత్రము కూడబెట్టావు!" అని ఎవరయినా నాన్నగారిని అడుగుతూవుండేవారు.

"ఆ అవస్థ మా అమ్మాయితో ఏంవుంది? ...దాన్ని పెళ్ళిచేసుకోవడానికి మహామహావాళ్లు పోటీలు పడ్తుంటే" అనేవారు నాన్నగారు.

"మా అమ్మాయి పెళ్లికేం వచ్చెలే" అని తేల్చేసి, ఆయన చివర చివరకు రాధకిక పెళ్ళికాదా! అని బెంగపెట్టుకునేవారు.

ఆమె ఎన్ని సంబంధాలని త్రిప్పికొట్టిందో లెఖ్ఖలేదు...అందులో వుద్యోగస్థులు వున్నారు...ఆస్తిపరులు వున్నారు...పలుకుబడివున్నవారున్నారు....కానీ వారెవరూ తన అందానికి సరిపోరని ఆమె తిరస్కరించింది. "నీకోసము యింకెవడో పునర్జన్మ ఎత్తాలి!" అనేవారు నాన్నగారు విసుగుతో...చిట్టచివరకి. రామనాధము సంబంధము వచ్చింది...ఆమె యిన్నాళ్ళ నిరీక్షణ ఫలించింది....రామనాధము రూపసి ...చదువు...తగుమాత్రము ఆస్తిగలవాడు నాన్నగారికి సంబంధము అంత యిష్టము లేదు...ఇదివరకు వచ్చిన సంబంధాలు ఒక్క రూపం మినహాయిస్తే ఎన్నో విధాల వుత్తమమయినవి....కానీలే! యీ సంబంధమయినా నచ్చింది అని నాన్నగారు చేతులు కడిగివేసుకున్నారు.

చిట్టితల్లి పుట్టింది...వీ రిద్దరి అందాన్నీ పంచుకొని జన్మించింది...దాన్ని చూసి... ఆ యిద్దరూ మురిసిపోయేవారు. దానికి సాయంత్రమయ్యేటప్పటికి దిష్టితీసి వేసే ...చిన్నప్పుడు రాధ తల్లికూడా యిదే చేసేది.

రాధకి విచారించేందుకు ఏముంది?...

వాంఛించేది యింకేముంటుంది ?...తను రూపవతి! తన భర్త రూపవంతుడు! చిటితల్లి తమ యిద్దర్నీ మించిన రూపవతి!... తన భర్తకి వుద్యోగముంది! ఆస్తి వుంది!... యిక ఏం కావాలి ?...ఎవరికి లొంగాలి ? ఎవర్ని చూసి బాధపడాలి?...

స్త్రీకి అతిశయము నేది ఏర్పడితే, తను రూపవతి అయితే ఏర్పడ్డంత అతిశయము, మరేవిధముగా ఏర్పడదు...రాధకి యీ పరిస్థితులలో...అహంకారము, అతిశయము ఏర్పడ్డాయంటే, అది చాలా సహజమయినది.

చిన్నప్పటినుంచి, తను రూపవతినన్న అహంకారముతోపాటు, అనాకారులమీద అసహ్యాన్ని ఏర్పరుచుకుంటూ వచ్చింది.

అంగవైకల్య మున్నవాళ్ళని పరిహాసించేది ఈసడించేది ... అంటరాని వాళ్ళని చూచినట్లు చూసేది... ఒంటిపిల్లల ఒంటికి కురుపులువుంటే చాలు, కొద్ది చొంగ కారుతుంటేచాలు, ముక్కునించి కొద్ది చీమిడి వస్తేచాలు వాళ్ళు దగ్గరకువస్తే గొంగళి పురుగులను దులిపివేసేటట్లు దులిపి వేసేది.

"ఏం చోద్యము పోతావే!..నీ మిడిసిపాటు అణచేందుకు నల్లటి మొగుడు రావాలి. గజ్జికురుపులతో నిండిన పిల్లలు పుట్టాలి. అప్పుడు నీపని చెప్పాలని.." తనని గురించి కొందరంటూవుండేవారు.

కాని నల్లని మొగుడు రాలేదు.

గజ్జి కాకరకాయలు పుట్టలేదు.

మిడిసిపాటు తగ్గలేదు.

రాధ తన మిడిసిపాటుతో ఎంతమందికి కష్టము కల్గించిందో ఎందరి హృదయాలు గాయపర్చిందో; తను ఎప్పుడూ ఆలోచించలేదు. ఆలోచించినా ఎక్కువ విలువ యివ్వలేదు. తన ప్రవర్తనవలన ఎక్కువ గాయపడింది. బాధపడింది తన వదినగారు.

పాపము! వదిన!..ఆమె రూపవతి కాదు. శరీరాలంకరణ కాని శుభ్రత కాని తెలియదామెకు. ఎప్పుడూ జిడ్డు కారుతూ!.. బట్టలు మాపుకుంటూ తిరుగుతూ వుంటుంది. రాధ ఆవిడకి పూర్తి వ్యతిరేకము. ఎంత ప్రయత్నించినా ఆవిడ రాధ అంతస్థు చేరలేదు. అసలు ఆ ప్రయత్న మేమిటో ఆమెకి తెలియదు. తనకన్న రాధ అన్నివిధాల మంచిస్థితిలో వుండడము..ఆమెలో యీర్ష్య కలిగించేది. రాధ నవ్వుతో ముఖము దిద్దుకున్నా, పౌడరు అద్దుకున్నా..ఆమెకు చాలా విడ్డూరముగా కన్పించేది. అంత వింత మనస్తత్వము.

బాబిగాడు!..వాడు తల్లి పోలికలతో పుట్టాడు. వాడి ఒంటిమీద ఎప్పుడూ బట్టవుండదు. ఎప్పుడూ మట్టిలో దొర్లుతూ వుంటాడు. ఒంటినిండా చీడపొక్కులు. వాళ్ళమ్మకి వాడి శుభ్రము గురించి పట్టేది కాదు. వాడికి రాధన్నా చిట్టి తల్లి అన్నా వెర్రి ఆపేక్ష. వాడు ఎంతో ఆపేక్షతో దగ్గరికి వచ్చేవాడు. తను విదలించుకునేది. తనదగ్గరకు వచ్చినదానికన్నా..చిట్టితల్లి దగ్గరకి వస్తే రాధ వళ్లు మండిపోయేది. వాడి కురుపులన్నీ దానికి అంటుతే. యింకేమయినా వుందా? చిట్టితల్లి అందము నాశనమయిపోదూ! అందుకని వాడ్ని పురుగుని దులపరించినట్లు దులపరించేది. పాపము ఆ కుర్రవెధవ చిన్నపుచ్చుకుని వెళ్ళిపోయేవాడు. తన కుమారుడికి జరిగిన యీ అవమానము ఏ తల్లి సహిస్తుంది? ఆ తల్లి హృదయము ఎంత గాయపడుతుంది?.. కాని యివేం గ్రహించడానికి రాధ ప్రయత్నించేది కాదు.

వదినగారి మూలాన తనకీ, అన్నగారికీ, మధ్య సంఘర్షణలు వచ్చేవి. వీరిద్దరినీ, అనునయించలేక, అమ్మా నాన్నా సతమతమయ్యేవారు.

"ఎందుకే బాబిగాడ్ని అల్లా దులపరించుకుంటావు? వాడికి నువ్వన్నా, చిట్టితల్లన్నా, ఎంత ఆపేక్ష!..నీ మిడిసిపాటు చూసి, వాళ్ళిద్దరికీ ఎంత కష్టముగా వుంటుంది?..భగవంతుడు అందర్నీ అదృష్టవంతులుగా సృష్టిస్తాడా? ఎవరి అదృష్టము వాళ్లది..అదృష్టవంతులు దురదృష్టవంతుల చూసి జాలిపడి, వాళ్ల దురదృష్టము మర్చిపొయ్యేట్టు చూడాలి కాని..వాళ్ళలో యీర్ష్య రేపుతే ఎల్లాగ.." అని అమ్మ ఎన్నో హితవచనాలు పలికేది. రాధ ఆచరణలో వాటిని పెట్టలేకపోయేది.

రామనాథము రాధని ఏడ్పించడానికి అంటూ వుండేవాడు. "బాబిగాడ్ని యిప్పుడు దులపరిస్తున్నావు... రేపు అల్లుడయ్యాడంటే నీ భరతము పడ్తాడు జాగ్రత్త!" అని.

# ★ దెబ్బతిన్న అహంకారం ★

"ఛీ ఆ గజ్జివెధవకి నా బంగారాన్ని.. యిస్తానా ఏమిటి?" అనేది రాధ.

"ఏం మేనరికం కాదంటావా?.. అమ్మ మాట కాదంటావా? అన్నతో విరోధము తెచ్చుకుంటావా?"

"దేనికయినా సిద్ధమే! నా చిట్టితల్లి కోసము. వాళ్లకి భయపడవల్సిన అవసరము ఏమిటి?"

"చిట్టితల్లిని చూసి బాగా మురిసిపోతున్నావులే!" అనేవాడు రామనాథము.

* * *

జీవితములో అనుకోని సంఘటనలు జరిగి జీవితపథాన్ని మళ్ళిస్తూ వుంటాయి.

ఎవరికీ భయపడవలసిన అవసరము కాని లొంగి యుండవలసిన అవసరము కాని లేదని భావించే రాధకు భర్తృవియోగము పెదదెబ్బ. వారము రోజులు టైఫాయిడుతో తీసుకుని మరణించాడు రామనాథము.

రాధకి ఆత్మీయుడు, జీవితములో అత్యంతసన్నిహితుడు, తనని ప్రాణాధికముగా ప్రేమించి తన సౌందర్యాన్ని ఆరాధించే భర్త యిరవయిఎనిమిదవఏటనే విడచిపోయాడు. యీ వెలితి పూడేది కాదు. తన జీవితస్వప్నాలన్నీ కరగిపోయాయి. "అమ్మా! నువ్వింతవరకూ మంచే చూశావు. యిక జీవితములో చెడు చూడాలి" అని పరామర్శకివచ్చిన ఒక ఆవిడమాటలు విని భయముతో కంపించిపోయింది.

"ఎందుకీ అందము! ఎవర్ని సంతోషపెట్టడానికి" తన అందాన్ని ఆరాధించేవాడుపోయినతర్వాత. జీవితములో మొట్టమొదటిసారిగా ఆమెకి తన అందముంటే నిర్లక్ష్య మేర్పడింది.

"రాధ! ఏంచేస్తుందిట!" "మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందా!" "చేసుకుంటే తప్పా. యిరవైఎనిమిదేళ్ళేగా." "పెళ్ళి చేసుకోక తన అందాన్ని వృథా చేసుకుంటుందా!" "యిప్పుడు చేసుకునేవుద్దేశ్యము లేకపోవచ్చు. కాని ముందుముందు యీబుద్ధి వుంటుందా" "ఏమో! ఆ వన్నెల విసనక్ర ఎక్కువరోజులు తిరిగి పెళ్ళి చేసుకోకుండా వుంటుందని తోచదు." - యిదీ. తన భావి గురించి కొందరు ప్రముఖులుచేసిన చర్చ సారాంశము.

తన అందము ఎందుకీ అపోహలు కల్గిస్తోంది? అంత నిర్దాక్షిణ్యముగా ఎందుకు తన పునర్వివాహముగూర్చి చర్చిస్తారు? తను రెండో పెళ్లికి ఆత్రుతపడ్డానని ఎందుకు వూహించాలి? ... స్త్రీ పునర్వివాహము చేసుకోకూడదని కాదు. అంతగా ప్రేమించిన తన భర్తని మరచిపోయి మరో పురుషుని తను చేపట్టుందని ఎందుకనుకోవాలి? అని రాధ విలపించేది. వీటికన్న బాధాకరమయినమాట తన 'వదినగారంది చాటుగా: "ఆ మిడిసిపాటు యిప్పటికయినా తగ్గుతుందిలే" అని. ఇంత అమానుషత్వమా. ఆమాట అనే సమయము యిదేనా?...అని బాధపడింది. కాని ఆమెలో అట్టి అమానుషత్వము కలగడానికి ...తను కారణమన్న సంగతి రాధకి స్ఫురించలేదు.

రాధ తల్లిదండ్రులు రాధని యింటికి తెచ్చారు. జీవితములో దెబ్బతిని యింటికి వచ్చింది. ఇదివరకు యీ యింటికి అతిథిగా వచ్చేది. ఇప్పుడు తిరిగి ఆ యింటిలో వ్యక్తిగా అడుగుపెట్టింది. ఇదివరకు తను ఒకయింటికి అధికారిణి. యిప్పుడీయింట్లో తను అధికారిణి కాదు. యిదివరకు యీ యింట్లో వ్యక్తులమీద కోపము వస్తే, వెంటనే రైలెక్కి, తన యింటికి చేరుకునేది. యిప్పుడు కోపమువస్తే దిగమింగుకుని కుళ్లికుళ్లి ఏడ్వాలి.

తన యీ అసహాయ స్థితిని తీసుకుని తనమీద వున్న ద్వేషాన్ని, కక్షని సాధించుకు నేందుకు ప్రయత్నించేది తన వదినగారు. ఆవిడ సూటిపోటిమాటలు శూలాలులాగ తగిలేవి. "మా ఆయన ఎంత సంపాదిస్తే ఏం అమ్మా. సంసారాలుమీద సంసారాలు వచ్చి పడ్తుంటే. ఆవిడకేం వచ్చు.

ఎప్పుడూ సింగారించుకోవడము తప్పు! ఏదో మా ఆయిన మంచివాడు కనుక, ఆ గర్విష్టిని భరిస్తున్నాడు." యీ విధముగా మాట్లాడేది.

ఎందుకో తనవదినకి యింత కార్పణ్యము. నిజానికి తను అన్నయ్యకి భారమయిందా! ...లేదు. తన భర్త యిన్సూరు చేసిన పది వేలు బ్యాంకులో వేసింది. దాని వడ్డీ డబ్బులు ఏటా వస్తున్నాయి. తన భర్త ఆస్తి రెండెకరాల పొలంలో గింజలు తనకి వస్తున్నాయి. ఈ ఆదాయము తనకీ, తన కూతురుకి ఎక్కువ. అయినా తన వదిన గారు, వాళ్ల సంసారానికి తనో గుది బండ అయినట్లు మాట్లాడుతుంది.

తను ఏం సింగారించుకుంటోంది. శుభ్రమయిన నీళ్ళతో మొగము కడుక్కోవడము కూడా నేరముగా మాట్లాడుతుంది. తను బొట్టు పెట్టుకోనీలేదు. కళ్లకి కాటుక పెట్టుకో నీలేదు...తాంబూలము వేసుకో నీలేదు. వేళ్ళకి గోరింటాకు పెట్టుకో నీల్లేదు.

అయినప్పటికీ.. తను సింగారించుకుంటోందని వదిన అంటుంది తల దువ్వుకోవడము, ముఖము కడుక్కోవడము కూడా తప్పా కాబోలు.

రాధ! స్వతంత్రముగా విడిగా వుండగలదు. తన ఆదాయము సరిపోకపోదు.. కాని తాను సౌందర్యవతి. తను ఒక్కతే కాపురముంటే, తనకి రక్షణ వుంటుందా? ఎన్ని అనుమానాలకి, అవమానాలకి గురి అవుతుంది. ప్రయత్నిస్తే తనకి వుద్యోగము దొరక్కపోదు. కాని తాను వుద్యోగము చేసినా చేయకపోయినా, ఒక్కతే విడిగా వుండడము ప్రమాదకరము. కష్టమయినా, నష్టమయినా అన్నయ్యని అంటిపెట్టుకుండవల్సిందే! అయితే ఎన్నాళ్లు యీ సూటిపోటిమాటలు పడుతూవుండడము? భగవంతుడు దయదలిచేవరకు తన గతి యింతే! తన సౌందర్యము తనకి శత్రువయింది. యీ సౌందర్యముతో ఒక్కతే వుండగలదా?

జీవితములో ఎంత విరక్తి కలిగినా..ఆమె చిట్టితల్లిని చూసుకుని..మురిసిపోతూ వుండేది. తన దుఃఖాన్ని, తన బాధల్ని ఆమె ఆటపాటలని చూస్తూ మర్చిపోయేది. ఇదివరకు తన ప్రేమని తన భర్త, చిట్టితల్లి పంచుకునేవారు. ఇప్పుడు..తను ప్రేమించినా, తనని ప్రేమించినా ఒక్క చిట్టితల్లి.. అది చల్లగావుంటే ఎన్ని కష్టాలయినా భరించగలదు. అది లేకపోతే తను జీవించి వుండవలసిన అవసరమే లేదు.

* * *

చిట్టితల్లికి నాలుగురోజులు మూసినకన్ను తెరవకుండా జ్వరము వచ్చింది. ఆ జ్వరములో పలవరింతలూ, పిచ్చిచూపులు. దాని స్థితి చూసేటప్పటికి రాధ హృదయము పగిలిపోయేది. ఇదికూడా తన తండ్రి వెంటనే వెళ్తుందా? యిక తనకి ఏమిటి గతి? ఓ భగవంతుడా! యింకా నీకు ఆగ్రహము తగ్గలేదా! స్వామీ! ఎందుకీ శిక్ష అంటూ ఆమె విలపించేది.

అయిదవ రోజున జ్వరము తగ్గింది. కాని మశూచికము చూపింది. తన చిట్టితల్లికి మశూచికము... ఇంట్లో మశూచికమువున్న పిల్ల నెల్లా పెడ్తామని, దొడ్లో ఓ పాకవేసి, అక్కడ పడుకోపెట్టించింది చిట్టితల్లిని తన వదినగారు. తనకి రాకూడదా! యీ మశూచికము..ఏ పాపము చేసిందని..చిట్టితల్లికీ శిక్ష. తను నేరముచేస్తే శిక్ష ననుభవించవలసింది..తను కాని..చిట్టితల్లి ఎట్లా అవుతుంది? ఏమిటీ విధివైపరీత్యము!

నూదిమొన మోపేటందుకయినా ఖాళీ లేనంతగా పోసింది అమ్మవారుతల్లి..యీ గడ్డురోగమునుంచి తన 'తల్లి' బ్రతుకుతుందా!.. "తను చచ్చిపోకూడదూ? అని బాధపడేది...

అమ్మవారు సెలవిచ్చింది.. చిట్టితల్లి బ్రతికింది.

కాని.. అమ్మవారు తల్లి చిట్టితల్లి అందాన్ని తీసుకుపోయింది.. మొగము నలుపెక్కిపోయింది..గంట్లు పడిపోయాయి. కుడి కంటిమీద పొర వేసింది. ఇప్పుడు తన చిట్టితల్లి కురూపి!

ఇన్నాళ్లు తను ఎవర్ని చూసి మురిసిపోయిందో!..ఆ అందమంతా ఏమయింది?.. యిదివరకు బాబిగాడు వస్తే వాడి కురుపు అంటుతాయని దాని అందము నాశనమయిపోతుందని వాడ్ని దగ్గరకు రానిచ్చేది కాదు. వస్తే కుర్రవెధవ మనసు కష్టపెట్టుకుంటాడనైనా లేకుండా, దులపరించి వేసేదే? యిప్పుడు ఏమయింది?..భగవంతుడు ఏం చేశాడు? వాడ్ని దులపరించిన పాపమే యిట్లా చెడిపోయిందా? ఇక అందరూ దాన్ని కురూపి అని, దాని అంగవైకల్యాన్ని పరిహసిస్తారు. అసహ్యించుకుంటారు..తన గర్వము అణగింది. కాని చిట్టితల్లి భవిష్యత్తు, దానికింక పెళ్ళి అవుతుందా? యిదంతా భగవంతుడు తనకి విధించిన శిక్ష!

"ఎందుకు అత్తా! ఏడుస్తున్నావు" అని బాబిగాడు అడిగాడు. పాపము! తను వాడ్ని ఎంత దులపరించుకున్నా, ఎంత అసహ్యించుకున్నా వాడికి తనమీద, చిట్టితల్లి మీద ఆపేక్ష తగ్గలేదు. వాడి హృదయములో ఎటువంటిమాత్సర్యాలకీ తావులేదు.

"బాబూ! రా నాయనా!" అంటూ వాడ్ని హృదయానికి హత్తుకుంది. గజ్జి కాకర కాయన్న యీసడింపు లేదు.

"ఏమిటమ్మా! వాడిని ఎత్తుకున్నావు" అంది వదినగారు వస్తూ ఆశ్చర్యపోయి!

కూడదా! వదినా!

"ఎందుకుకూడదూ! పాపము వాడ్ని మంచిచేసుకుని అల్లుడ్ని చేసుకుందా మనుకుంటున్నట్లున్నావు. కాని మావాడికి ఆ ఏకాక్షి అక్కర్లేదు" అంది వదినగారు.





శిల్పశిఖరాలు



—ఫొటో : జి. రామమూర్తి, మద్రాసు.




# క్రీడలు



క్రీడలంటే ఏమిటి? వాటివల్ల కలిగే ఆనందము ఎటువంటిది? జీవితములో వాటివల్ల కలిగే ప్రయోజనమేమైనా ఉన్నదా? ఆడుకోవాలని ఎందుకనిపిస్తుంది? పిల్లలకేనా పెద్దలకుకూడానా? దీనిలో స్త్రీలుకూడా చేరుతారా?

ఈ ప్రశ్నలకు అందరికీ తలకొక విధాన సమాధానాలు తోస్తాయి. విడివిడిగా అందరికీ తోచినవీ, శాస్త్రజ్ఞులు పరిశోధించి తేల్చినవీ ఒక పెద్ద గ్రంథమవుతుంది. ఇంతాచేస్తే క్రీడ అనేది ఒక చిన్న రెండక్షరాల సంస్కృతపదము. క్రీడ అంటే ఆటేగా!

ప్రతిమానవుడికీ తన సహజశక్తినీ సామర్థ్యాన్నీ ఉపయోగించవలెననే ఉత్సాహము ఉబలాటము కొంత ఉండటము సహజము. తన జీవితనిర్మాణానికై స్వయం కృషిచేయవలసిన అవసరము ప్రతివ్యక్తికీ అవసరమే. ఈ అవసరాన్ని వెల్లడిచేసే అవకాశాలను ఆవిష్కారమునిచ్చేవి క్రీడలన్నారు ఒక శాస్త్రజ్ఞుడు.

మానవుడికి క్రీడలు లేకపోతే జీవితము శూన్యమైపోతుందా? క్రీడలు జీవితావసరములా? అంటే అవి లేనిదీ మానవుడు బ్రతుకలేడనీ కాదు - ఆ క్రీడలయినా ఇప్పుడు మనము చూస్తున్న క్రికెటు హాకీ, బాడ్మింటన్ టెన్నిస్ వగైరాలవలెనే ఉండాలన్న సిద్ధాంతమూలేదు. మానవ ప్రకృతిలో అంతర్గతమైన వివిధ శక్తులు బహిర్గతము కావటానికి తగిన అవకాశము కొరకు నిరీక్షిస్తూ ఉంటాయి. వాటిని బహిర్గతము చేయుటానికి మానవుడుచేసే ప్రయత్నాలూ సాధనక్రియలూ క్రీడలన్నారు మరొకరు.

ఇల్లిందల సరస్వతీదేవి

మానవుడిలో అంతర్గతములయిన శక్తులను బహిర్గతమొనర్చి వాటికి చలనశక్తి నిచ్చేవి క్రీడలే నన్నారు ఇంకొకరు.

ఈపై ముగ్గురు తమ సిద్ధాంతాలను వ్యక్తీకరించటములో మాటభేదము చూపారుగాని మొత్తముమీద కొంత వ్యత్యాసముతో ఒకటేనన్నట్లు తేల్చారు.

మానవుడిలోగల వివిధశక్తులకు చైతన్యము కలిగించటమే కాకుండ ప్రకృతి సహజమైన జీవితాశయాలను సఫలపరచుకొనటానికి అవకాశములను కలిగించేవి కూడా క్రీడలే. ఇదే క్రీడలమీద మానవుడికిగల ఆకర్షణకు మూలకారణము. ఈపై సిద్ధాంతాలన్నీ క్రీడలవల్ల మానవుడికి కలిగే ఆనందానికి పునాదులు మాత్రమే.

తనలోఉన్న శక్తినీ సామర్థ్యాన్నీ సాధ్యమైనంతవరకూ యిష్టమువచ్చినట్లుగా ఉపయోగించటానికి స్వేచ్ఛ గలతావు క్రీడారంగమే. క్రీడారంగములో పై అధికారితో క్రింది ఉద్యోగి స్వేచ్ఛగా ఆడి ఓడించవచ్చు. క్రీడారంగములో ఉన్న స్వాతంత్ర్యము పనిచేసేటప్పుడు ఉంటుందా అంటే ఉండదు. ఈ పని, ఇంతకాలములో, ఈ విధముగా చేయాలన్న నియమమే కాకుండా అధికారులు వచ్చిచూస్తారు. ఏమంటారో నన్న బెరుకు పనిలో ఉంటుంది. క్రీడలలోకూడా యథేచ్ఛతో కాక పురమాయింపుమీద ఆడిన ఆటలలో అంత ఆనందము కలుగకపోవటముకూడా సహజమే. ఆ సందర్భాలలో క్రీడ కాస్తా పనిగా విధి క్రింద మారిపోతుంది. యథేచ్ఛతో ఆడిన క్రీడలవల్ల కలిగే ఆనందమే క్రీడలకూ పనికీ వ్యత్యాసాన్ని కల్పించింది.

జాతులు సంఘాలు వర్గాలు, పరిస్థితులు మానవులలో కల్పించిన కృత్రిమ వ్యత్యాసాలను మరచి అందరూ యథేచ్ఛగా పోటీ

వారితో ఏకమై ఆనందించటానికి అనువైనది ఒక క్రీడారంగమే. ఈ క్రీడలు బాల్యదశ దాటిన తరువాత సహకార సంస్థలుగా మానవజీవితాలలో రూపొందుతాయి. కుచేలుడి దుర్భరదారిద్ర్యాన్ని నిర్మూలించిన కృష్ణుడు ఆయన చిన్ననాటి జతగాడు. బాల్యములో పిల్లలకు తోటి వారందరూ సోదరప్రాయులే. బాల్యములో భ్రాతృవాత్సల్యము నిర్మలమైన హృదయక్షేత్రములో పుట్టి ఆనందపిచికలతో పెరుగుతుంది. నిష్కల్మషమైన చిన్ననాటి వాత్సల్యాన్ని సహృదయు లెవరూ మరుగు పరచుకోలేరు.

ఒక్కరూ ఆడుకొనే ఆటనైనా పిల్లలు ఒంటరిగా ఆడుకోలేరు. ఆటలు నలుగురితో చేరి ఆడుకోవాలనే ఇచ్ఛ సహజము. ఈ వాంఛ క్రమముగా మానవుడిని సంఘజీవిగా జేసి, నలుగురితో కలిసి మెలసి తిరగటానికీ, సుహృద్భావముతో మెలగటానికీ దారితీస్తుంది. ఈ సంఘసంబంధమువల్ల తగవులు ఈర్ష్యలు మొదలైన కొన్ని నష్టాలున్నప్పటికీ మొత్తముమీద హృదయానందకరమైనది.

బిడ్డల మనఃప్రవృత్తులు ఆటలద్వారా బహిర్గతమవుతాయి. వీటిలో కలిగే విజయాలు బిడ్డల ఆత్మశక్తినీ పుష్టినీ కలిగిస్తాయి. ఆటలలో తోటివారిని గెలవాలనే పోటీకొద్దీ ఉత్సాహముకొద్దీ తన శక్తులను ద్విగుణీకృతము చేసుకోవాలని ప్రయత్నించటము సహజము. ఎదటివారిని గెలిచి మించిపోవాలన్న సహజకుతూహలమే దీనికి కారణమూ, క్రీడలంటే మానవులకు గల ఆకర్షణాను.

క్రీడలలో ఉన్న మరోవిశేష మేమంటే ఒకసారి అపజయము కలిగినా, మరొకసారి మరొకవిధాన ప్రయత్నించి సఫలీకృతుడు కావాలనీ, ఏ విధముగానైనా కార్యము సాధించాలనే పట్టుదలనూ మానవుడిలో సృష్టించేవి క్రీడలే. అందుకే మనలో ఉప్పొంగుతున్న ఉత్సాహశక్తులను బహిర్గతము చేయటానికి అనువైన ఆనందకరమైన మార్గాలే క్రీడలన్నారు. స్వశక్తిని సంపాదించుకోవటానికి అవకాశము కల్పించి వ్యక్తులకు ప్రాధాన్యతను చేకూర్చేవి క్రీడలే. ఒక నాయకుడి క్రింద మసలుకొని ఏకముఖముగా విజయము సాధించటానికి అనువైన సామూహిక శక్తులను స్వభావాన్ని మానవుడిలో క్రీడలే పెంపొందిస్తాయి. అపద సమయాలలో కావలసిన మెలకువ జాగ్రత్తలను ఉద్భవింపజేసే శక్తి క్రీడలలో ఉన్నది.

ఆటలు మానసికముగా విశ్రాంతినీ ఉల్లాసాన్నీ కలిగిస్తాయి. క్రీడలంటే మనసును ఉల్లాసపరచే ఓషధులన్నమాట. దేహానికి పరిశ్రమను కల్పించి ఆరోగ్యానికి చేయూతనిచ్చేవి కూడా క్రీడలే.

జీవితములో కృతకృత్యులు కావటానికి క్రీడలు దోహదక్రియలుగా ఉపకరిస్తాయి. ఇవే బాలల భావిజీవితాలకు బాటలు వేర్పరచేవి. ఏ వ్యక్తికయినా ఒక విషయములో అమితాసక్తి ఉన్నదంటే ఆ వ్యక్తికి బాల్యములోగల క్రీడాసక్తే కారణమూ మూలమూను.

ఏకాగ్రతతో సాధించబడిన కార్యము విధించబడిన పనివలె భారమనిపించదు. అది రూపొందిన క్రీడవంటి దనిపిస్తుంది. ఎటువంటి కష్టసాధ్యమైన సమస్యనుగాని క్రీడవలె తోపింపచేస్తుంది.

క్రీడా పిపాస బహు గంభీరమైనదే కాక అగాధమైనది. ఈ పిపాస క్షుద్బాధకంటె తీవ్రమైనది. కళాకారుడు ఈ విధమైన బాధతో పీడింపబడతాడంటే మనకు ఆశ్చర్యముగా ఉంటుంది. తనకు కడుపు నిండదని తెలిసికూడా కళారాధన చేసి, మనసుకు ఆహ్లాదాన్ని కలిగించుకుంటాడు కళాకారుడు. దీనికి కారణము కళారాధన చేసే సేగాని అతడి పిపాసతీరదు, మనసు సంతృప్తి చెందదు. కవులుకూడా అంతే. దారిద్ర్యములో మునిగి తేలుతూ మహాకవులు ఉత్కృష్టమైన రచనలను చేసి ఆనందించారు. కళారాధన వారి కొక క్రీడ. ఆ క్రీడా విశేషమే జగత్ప్రఖ్యాతము చేకూర్చు మహారచనలు. జగత్సృష్టి అంతా

వనితాలోకం:

# నిత్యనైవేద్యం

'సీతా' శంకరం పిలుపు.

'............'

'పలకవేం' మళ్ళీ కేక.

'వస్తున్నా, ఇవతల పోపు మాడిపోతూంటే'

'నేను పిల్చినపుడే నీ కన్నీ పనులూను.'

'అయితే సమాధానం చెప్పటం కూడా తప్పేనా! పదిగంటలకల్లా వంట కావాలి కదా అని గబగబ వంటచేస్తూంటే, ఈ గంటలోనూ ఓ తొంభైసార్లు పిలుపు, మాట ఆడితే తప్పు, ఆడకపోతే తప్పు, ఎలాగండీ మీతో.'

'అయిందా వుపన్యాసం. ఇంక మేం మాట్లాడవచ్చా.'

"నాలుగు మాటలు మాట్లాడితే వుపన్యాసమంటారు. మాట్లాడకపోతే మొద్దులా పలకవంటారు. ఏం చేసినా తప్పులాగే వుంది"

"అను అను. ఎన్నంటావో అన్నీ అను. ఇంకొక్క అరగంట కదా! ఇక్కడుంటాను. ఆ తర్వాత హాయిగ వుందురుగాని నువ్వూ, పిల్లలూను."

"రామ రామ. ఏమిటండీ ఆ మాటలు. వినున్నానని."

"అన్నవన్నీ ఎవరో."

"తప్పుమాట వినున్నానండీ. తీరికలేదని చెపితే మీకంత కోప మెందుకు?"

"అవునవును. నా కోపమే కనిపిస్తుంది. పోనీలే, కొసిని మెతుకులు పడెయ్యి. నే పోతాను."

ఇ. సుషమాదేవి

ఈలా వుంటుంది వారి దినచర్య, రోజూ గాలీ, వానా లేకుండా కాలక్షేపం చేదామని ఎంత అనుకున్నా సాగదు. ఏదో ఒకటి. చీకటుండగనే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, ఇంటిపనుల్లో ప్రవేశిస్తే, మళ్ళీ రాత్రి 9 గం॥ వరకూ విధీ, విరామం లేకుండా, గానుగెద్దులా తిరగవలసిందే. రాత్రి నాలుగు ఘడియలూ సుఖంగా నిద్రపోదామంటే, ఏదంటినాడు లేవడమో, భర్తకాళ్ళు పట్టమనడమో, తనకి వేడిచేసి నిద్రపట్టక పోవడమో వుంటూనే వుంటాయి. ఇంక తను సుఖపడ్డ మెపుడు? ఇదేమన్నా ఆలోచిస్తున్నాడా తనభర్త! ఎంతసేపూ తను పిలిస్తే పలకలేదనీ, ఆఫీసునుండి వచ్చేసరికి కలకల్లాడుతూ చిలకలా అలంకరించుకుని ఎదురుగా నిల్చొని చిరునవ్వు లొలకబోస్తూ పలకరించలేదనీ! ఇంతేగా! ఏం చేస్తుంది తను మాత్రం! శాయశక్తులా అతన్ని సుఖపెట్టడానికే ప్రయత్నిస్తూందాయె!

ఈవిధంగా ఆలోచించుకుంటూ సీత గబగబ ఆ కొత్త వంటిల్లు తుడిచి పీట వేసింది. పెళ్ళికి తన తండ్రి ఆప్యాయంగా అల్లుడికి చేయించి ఇచ్చిన కంచం కడిగి పెట్టింది. ఆ కంచం చూస్తేనే చిరాకు శంకరానికి! అయినా తను ఆ కంచం పెట్టకుండా వుండ లేదు. తన తండ్రి ఆప్యాయంగా చేయించిన ఆకంచం పెట్టుకోకుండా ఏమంతోచ్చిందో! కోప మొచ్చినపుడల్లా ఆ కంచాన్ని అమడ దూరం తోసేస్తూంటాడు తన భర్త! పిల్లలు ఆడిఆడి సొట్టలు చేసేశారు ఆ కంచాన్ని! ఇన్ని విధాలా, తన మనసులో అనుకుంటూ, ఒకరోజున అంట కంచం తోమి, దొడ్లోంచి తెస్తున్నప్పుడు అనుకోకుండా చేయిజారి పడిపోయింది. దానితో ఇదివరకున్న సొట్టలేకాక దాని ఆకారం పూర్తిగా మారిపోయింది!

శంకరం తువ్వాలు భుజంమీద వేసుకుని వచ్చి కూర్చున్నాడు భోజనానికి. అతనూ మాటలేదు; తనూ మాటలేదు. పప్పూ, కూర వేసి, అన్నం వడ్డించిందో లేదో దొడ్డో దొండపాదుక్రింద ఆడుతున్న చంటి కుర్రాడు ఒకటే గావుకేక! అన్నం పళ్ళెం అక్కడే వదిలేసి అదే పరుగు సీత!

"ఏం సాదరా బాబూ" అనుకున్నాడు శంకరం. ఆవిడ అల్లా పరుగెడితే, తనకి

పరమేశ్వరుని క్రీడావిశేష మేనని వేదాంతుల నమ్మకము. దానివలన కలిగే లాభనష్టాలను లెక్కించుకోకుండా - దానిలో నిమగ్నులయి విజయముపొంది, తద్వారా ఆనందించేటట్టుగా మానవులను ప్రేరేపింపచేయుట మే క్రీడలలోని ప్రత్యేకత, ప్రధాన లక్ష్యమూను.

క్రీడలు క్రీడలకొరకే కాదు. మనసుకు వికాసాన్ని కలిగించి, సంకుచితత్వాన్ని భేదించి, హృదయవైశాల్యాన్ని కలిగించగల సాధనలు. మానవుని పరిపూర్ణునిగా ఆత్మశక్తికలవానిగా చేయగల మహత్తరశక్తి క్రీడలలో ఉన్నది.

జీవితములో జయాపజయాలు దైవాధీనములనీ మానవశక్తి కతీతములనీ మానవులను దృఢముగా నమ్మించేవి క్రీడలే.

క్రీడానైపుణ్యము మానవుని *Sportsman* గా తయారుచేయగలదు. క్రీడారాధనకు స్త్రీ పురుష భేదముగాని వయోభేదముగాని లేదు. అది సర్వులూ ఆరాధించతగిన సర్వోత్కృష్టముగు కళ. ★

గొయ్యి వేసేవా రెవరూ? పిప్పిపిల్లి ఉంటే అనుకోవచ్చు. అదీ లేదు. ఇంక తప్పదను కుని గూట్లో వున్న నేతిగిన్నె కోసం లేచాడు. తీరా చూస్తే దాన్నిండా చీమలు. పోనీ డబ్బాలోంచి తీసుకుందామని ప్రయత్నించేను. ఎంత ప్రయత్నించినా ఆ డబ్బా కనిపిస్తేగా! ఆవిడగారు ఎక్కడ పెట్టిందో ఆవిడకే తెలియాలి, ఆ బ్రహ్మకే తెలియాలి! పోనీ, ఒక్క మెతుకుతే కతుకుదాం అని నేతి డబ్బా వెతకడం విరమించుకుని, వెనక్కి తిరిగేసరికి, అప్పుడే ఆరగింపు అయిపోతోంది. ఎవరూ? రోజూ యింట్లో తిరుగుతూ, అన్ని మూతలూ తిరగతోస్తూ, చిరాకుగా ఉన్నప్పుడు, పరాకున సీత వదిలేసిన పాలు తాగేస్తూ, దంటివాడి పాల

 నిత్యనైవేద్యం 

సా పగులకొట్టిన నల్లపిల్లి! చూస్తూంటే తిప్పలూ వద్దు అవతలపడితే బాగుండు శంకరానికెలాగుంటుంది? తిండీ వద్దు, ననుకున్నాడు. మాట్లాడకుండా చెయ్యి



కడుక్కొని ఇవతలకి వచ్చేశాడు. దంకీనున్న చొక్కా తీసి తొడుక్కుంటుండగా పెరట్లోంచి సీత వచ్చింది. కెలికేసినట్లున్న కంచం, ఎలా వేసిన వలాగే నున్న పదార్థాలు చూసి, మళ్ళీ కోప మొచ్చింది కాబోలనుకుంటూ మధ్య గదిలోకి వచ్చింది.

"భోం చెయ్యకుండా లేచిపోయారేం."

"భోజనం వద్దు, బొట్టూ వద్దు. నన్ను వెళ్ళనియ్యి."

"ఏం, పిల్లి కాని ముట్టుకో లేదుకదా!"

"........."

"దంటాడ్ని వెన్ను మీద కండ చీము కీకేసిందండీ. గోల చేస్తూంటే వెళ్లాను. దిక్కుమాలిన పిలి ఇంతలోనే రావాలా?"

"పిల్లి కేం ఖర్మం దిక్కుమాలిన దవడానికి! అసలు దిక్కుమాలినవాళ్ళం మనం."

"అయ్యో అవేం మాటలండీ. భోంచేయకుండా వెళ్ళిపోతారా!"

"........."

"పోనీ వి స్తరివేసి వడ్డిస్తాను కండి"

"నా కక్ఖర్లేదు."

"మీ కక్ఖర్లేకపోతే సాకూ వద్దు. నాకేమిటిదంతా? నేనూ తినను."

శంకరం చెప్పులు తొడుక్కొని నడిచేడు వీధిలోకి. అతనలా వెళ్ళిపోతూంటే నిర్ఘాంతపోయి చూస్తూవుండిపోయింది సీత. అంతకంటె ఏం చేయగలదు!

రోడ్డంట నడిచివెడుతున్నాడన్నమాటే గాని శంకరానికి మనసు మనసులో లేదు. ఎదురుగా కారే వస్తోందో, రిక్షాయే వస్తోందో, సైకిలే వస్తోందో, మనుష్యులే వస్తున్నారో, ఏమీ కనుపించటం లేదు. అరిగిపోయిన చెప్పులతో అడుగులు పడుతున్నాయన్నమాటే కాని, అతని మనస్సు పరిపరి విధాల పరుగెడుతోంది. ఒకటే ఆలోచన, తన జీవితంగురించి.

అందరి జీవితాలూ ఇలాగే వుంటాయా లేక తనకేనా ఈ ప్రత్యేకత? అందరూ ఇలాగే వుంటే నిజంగా పిచ్చెత్తిపోరూ? తను కనుక ఏదోవిధంగా నెట్టుకొస్తున్నాడు. నెట్టుకురాక ఏంచేయాలి? ఎన్నాళ్ళిలా నెట్టుకురావాలి? ఎంత అంటీ ముట్టకుండా తిరుగుదామన్నా రోజూ ఏదో ఒకటి తప్పడంలేదు. ఎంతకని తనుమాత్రం ఓరుస్తాడు. ఓర్పక చేసేదేముంది? పోనీ ఏదో విధంగా సీతకి నచ్చచెప్పుదామంటే ఆమె వినే పరిస్థితిలో వుందా? చచ్చీ చెడీ పగలంతా ఆఫీసులో నానా యాతనపడి, ఎప్పుడు కొంపకి చేరుకుందామా అని ఇంటికి వచ్చేసరికి, నానా రభసా జరుగుతూంటుంది ఇంట్లో. ఇంటికి వెళ్లేసరికి దంటి పిల్ల ఏడుపు, ఎడపిల్లాడు గోల, ఇంటావిడ

తంట, ఇంక ఎటొచ్చీ కాస జ్ఞానమొచ్చింది పెద్దపిల్ల. దీపం వెలిగిస్తూనో, తమ్ముణ్ణి ఆడిస్తూనో, చెల్లెలికి వుయ్యాల వూపుతోనో, అమ్మకి సాయం చేస్తూనో తంటాలు పడుతూంటుంది. దాన్ని చూస్తే తనకి జాలి. ఇదంతా చూస్తూంటే రోజూ అనుకోవడం ఎలాగోలాగ సీతకి నచ్చచెపుదాం, ఇల్లు కాస్త మార్చి, ఇంట్లోవాళ్ళు సుఖంగా వుండేటట్టు చూచుకుందాం నువ్వూ, నేనూ సహకరిస్తే ఆపాటి చేయలేమా? అని చెపుదామనుకుంటాడు. కాని ఇంటికి వచ్చేసరికి, ఏదో గలభా జరగడం, మనస్సు పాడైపోవడం, ఆవిడతో మాట్లాడకపోవడం, ఆరోజు జరిగిపోవడం. ఎన్ని రోజులు గడిచిపోతున్నాయో ఈవిధంగా! ఇంక చెప్పడమెపుడు? చెపుదామని అనుకోవడమే కాని ఈ జీవితం ఇంక ఇంతే కాబోలు!

ఇంటిదగ్గర సీత:— ఎన్ని విధాల ప్రయత్నించినా ఆయనకి ఒక్కరోజుకూడా కోపం రాకుండా చేయలేకపోతున్నాను కదా? ఎందుకో అంత కోపం? ఎవరిమీదో అంత కోపం? నేనుమట్టుకు ఏం చేయగలను? ఆయనున్నంతసేపూ పిల్లల్ని ఆ వైపుకైనా వెళ్ళనియ్యనుకదా? ఏడుపుకూడా వినిపించకుండా వుంచడానికి ఎలా వీలవుతుంది? అద్దె యింటిలో, ఆ వున్న మూడుగదుల్లోనూ వుండకుండా ఎక్కడికి పోతారు? అయినా, ఇంట్లో పిల్లలంటూ వున్న తర్వాత, అల్లరిలేకుండా ఎలాగుంటుంది? పెద్దపిల్ల అల్లరిచెయ్యదు. చంటిపిల్ల, ఎటొచ్చీ ఆ ఎడపిల్లాడే ఏ అల్లరిచేసినాను. వాడసలు తండ్రి చాయలకే వెళ్ళడు. ఇంకెందుకు విసుగు?

ఇవతల పిల్లల్ని సముదాయించుకోవాలి. ఇంటిపని చూచుకోవాలి. భర్తకి ఏం కావాలో చూడాలి. అతనికి కోపం రాకుండా మెసలాలి. ఎలా సాధ్యం? ప్రొద్దున్నే లేచి కాఫీపెట్టి, అతను లేచేసరికల్లా సిద్ధంగా వుండాలి. స్నానానికి వేణ్ణీళ్ళు, సబ్బు, తువ్వాలు పెట్టాలి. ఇంతలో ఈ పిల్లలు ఏ అఘాయిత్యం చేయకుండా చూడాలి. ముగ్గురు పిల్లలు. పెద్దపిల్లని ప్రొద్దున్నే స్కూలుకుపంపాలి. తక్కిన ఇద్దరూ చిన్నపిల్లలు. ఆ చంటిపిల్లకి పనిమనిషి వుండగానే నీళ్ళుపోసుకోవాలి. దాన్ని వుయ్యాల్లో పడుకోపెట్టాలి. ఆటుపైన పనిలోకి దిగాలి. రోజంతటికీ ప్రొద్దున్న పని మరీ తెమలదు. అందుకే ఇదివరకు రెండు మూడుసార్లు సూచించింది భర్తదగ్గర - "మా అమ్మని రమ్మని వ్రాయిస్తానండి. బొత్తిగా ఒకత్తెనూ పని చేసుకోలేకుండా వున్నాను. ఏదో ఇంత వుడకేసి పడేస్తుంది. నేను పైపనంతా సవరించుకుంటాను. ఈ చంటిదానితో మహా కష్టంగా వుంది. మా అమ్మవస్తే పిల్లల్ని నేను చూసుకోవడానికి వీలుగా వుంటుంది. మీరు "ఊ" అంటే పెద్దపిల్లచేత ఓ కార్డు వ్రాయిస్తాను."

"సరి సరి నీతోనే, నీ చాదస్తంతోనే పడలేకుండా వుంటే ఇంకొకావిడకూడానా? కడిగిందే కడిగి, తోమిందే తోమి, ఇంక ఒంటిగంటయినా మెతుకులు రావు. చాలు చాలు, పడే అవస్థేదో పడదాం ఇదే బాగుంది" అన్నాడు శంకరం. ఇంకేం సమాధానం చెపుతుంది తను?

ఇవన్నీ మనస్సులో మెదుల్తుండగా, మధ్యగదిలో చాప వేసుకుని నడుం వాల్చింది సీత. పిల్లలు ముగ్గురూ పడుకుని నిద్రపోతున్నారు. ఇంతలో వీధితలుపు చప్పుడైంది. ఈ వేళప్పుడు ఎవరువస్తారు చెప్మా అనుకుంటూ లేచి తలుపుతీసింది సీత. రిక్షావాడికి డబ్బులిస్తోంది తనతల్లి. ఒకప్రక్క తల్లి వచ్చిందనే సంతోషము, మరొకవైపున భర్తనుగురించి అంతులేని ఆలోచన. అత్తగారు రావడమంటేనే అంత యిష్టంలేని మనిషి, ఇప్పుడీవిడ ఇలా రావడంతో ఇంట్లో ఏయుద్ధం వస్తుందో? కొంప తీసి మొహంమీదే అనేస్తారేమో! రాకరాక ఆవిడ రావడం, ఏదైనా మాటంటే కష్టంగా వుంటుంది. ఎటూ తోచలేదు సీతకి. తల్లిని పలకరించనైనా పలకరించలేదు. వెనక్కి తిరిగింది. కూతుర్ని వెంబడించింది తల్లి.

శంకరం తిరిగి తిరిగి, సాయంకాల మవగానే ఇంటికి వచ్చేడు. వంటింట్లో కబుర్లు వినిపిస్తున్నాయి. ఎవరొస్తారు? అయినా, వంటింట్లో కబుర్లు చెప్పేటంత చను వెవరికుంది ఈ వూళ్ళో! ఎవరో బంధువులై వుండాలి? సీతని పిలిస్తే తెలిసిపోతుంది: అనుకున్నాడు శంకరం, 'సీతా' అని పిలిచాడు. వంటింట్లో కూర్చుని తల్లితో కష్టం సుఖం చెప్పుకుంటున్న సీత, శంకరం పిలుపు వినగానే, చటుక్కున యివతలికివచ్చి "ఎంతసేపైందండీవచ్చి" అంది.

"ఎంతసేపైతేంలే, ఇంతకీ నీతో మాట్లాడేదెవరూ?"

"ఇందాక ఒంటిగంటకి బస్సులో మా అమ్మ వచ్చిందండీ."

"ఉత్తరంకాని వ్రాశావా రమ్మని."

"లేదండీ. పిల్లల్ని చూచి ఆర్నెల్లయింది కదా, ఓసారి చూచిపోదామని వచ్చిందట."

"సర్లే. వెళ్ళు."

మాట్లాడకుండా వెళ్ళిపోయింది సీత.

"ఎందుకే అమ్మా పిలిచేవు" అంది తల్లి. "అ. ఏంలేదు. కాఫీ కావాలిట" అంది. ఏమని చెపుతుంది? మనసులో మాత్రం అనుకుంది - ఈయన ఎప్పటికీ ఇంతేనా!

★

"దాపరికం లేకుండా నీ భార్యకు అన్ని విషయాలు చెప్పేస్తుంటావా?"

"మరొకరు ఎవరన్నా ముందు చెప్పేస్తారేమోనని భయం ఉన్న విషయాలన్నీ."

* * *

రామయ్య: అబ్బ. విసుగొస్తున్నది. ఈవూళ్లో వెంకయ్య యిల్లంటే ఎవరూ చూపించలేం!

సత్యం: అందుకే తెలియని వాళ్ల నసలడగనే కూడదని చెపుతా.

—జే. విశ్వనాథ, సికింద్రాబాద్.

* * *

రాము: సూర్యుడు-చంద్రుడు, వీరిలో ఎవరు గొప్పరా?

సోము: చంద్రుడే గొప్ప. ఎందుకంటే చంద్రుడు రాత్రి వేళప్పుడు వెలుగునిచ్చి సహాయము చేస్తున్నాడు. కాని సూర్యుడట్లాకాక దినములో వెలుగు అవసరములేనప్పుడు వెలుగునిస్తున్నాడు.

—యం. నరసింహారావు, హైదరాబాద్.




# చిట్టి ప్రశ్న - గట్టి జవాబు

యేతేశ్వరపు విశ్వపతిశాస్త్రి

పంతులయ్య ఒక్కనాడు, పాఠ్యగ్రంథములను తెరచి,
పురాణాలగాథలన్ని, నిరూపించి చెప్పుచుండ,
అర్జునుడా? కర్ణుండా? అధికుడెవ్వడనే ప్రశ్న
తర్జనభర్జన జేయగ, పంతులయ్య అర్జునుడే
అన్యాయం బెరుగడంచు, అజయుండరి జనులకంచు
చిన్నికృష్ణు చెలుడటంచు, చేవగల మగాడటంచు
భట్రాజుపొగడ్తలెంతో, దిట్టంగా చేసె; నంత
జెంతనున్న బాలుడొకడు, జంకులేక నిలచియడిగె:
"అన్న కర్ణు జంపడె అన్యాయముగా యుద్ధమందు?
చిన్నికృష్ణు జతవీడడె మున్నగయునిగాచుటందు?
బభ్రువాహనుని జెంతను బలము జెడి వీగరాడె?
చేవగలమగాడైన చో కిరాతులకు ఓడుటేల?
ఇట్టి అర్జునుండు యధికు డెట్టులౌను యోచితలప?
దానధర్మముల రెంటిని దప్పక, నమ్మిన రాజుకు
ప్రాణమిచ్చి కృతార్థుడై నాణెపు జీవితమంటిన
కర్ణుండే యన్నింటను ఘను" డంచును నొక్కి చెప్పె.
ఆ మాటలు విన్నపంతు లాశ్చర్యము జెంది, "ఓరి!
భడవా!" యని యొక్కసారి ఆవలించె తన నోరు.





అక్క చేష్టలకి చెల్లెలు అనుకరణ



# టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర

మూలం మార్క్ ట్వేన్

సీరియల్ టామ్‌సాయర్, హకల్ బెరీఫిన్ నవలలకు తరవాత జరిగిన కథను తెలుపుతుంది. "హకల్ బెరీఫిన్" నవలలో మాదిరి గానే ఈ నవలలో కూడా హకల్ బెరీఫిన్ అనే కుర్రవాడే కథ చెబుతాడు. ఈ నవలలో టామ్‌సాయర్ అనే మరో కుర్రవాడూ, హక్ బెరీఫిన్, వీళ్ళ స్నేహితుడైన జిమ్ అనే నీగ్రో ముఖ్యపాత్రలు. టామ్‌సాయర్‌కు ఎప్పుడూ ఏదో సాహసం చేస్తూనే వుండాలనీ, పేరు దేశదేశాల్లో మోగిపోతూ వుండాలనీ కోరిక. అందుచేత ఇదివరకు చేసిన సాహసాలతో తృప్తిపడక, కొత్తవాటికోసం చాలా తపన పడుతుంటాడు. కాని మిగతా వాళ్ళిద్దరూ అతని ప్లాన్లు అన్నిటినీ తోసివేస్తారు. ఏం చెయ్యడానికీ పాలుపోకుండా వున్న సమయంలో, ఒక ప్రొఫెసరు బెలూన్‌లో యూరప్ ఖండానికి బయలుదేరనున్నట్లు వాళ్ళకి తెలుస్తుంది. అది చూసివద్దామని వెళ్ళిన టామ్, హక్, జిమ్ ముగ్గుర్నీ ప్రొఫెసరు లోపలికి రానిచ్చి హఠాత్తుగా బెలూన్‌ను బయలుదేర దీస్తాడు. యూరప్ ప్రయాణమై పోతున్న విమానంలో ముగ్గురు మిత్రులు నిర్ఘాంతపోయి కూర్చున్నారు.

## 4

పైన అనంతమూ, అగాధమూ అయిన శూన్యాకాశము; కింద భయంకరమైన మహాసముద్రము; ఆ సముద్రంలో కళ్ళు చించుకొని చూసినా ఉవ్వెత్తున లేచే కెరటాలు తప్ప మరేమీ కనుపించడంలేదు. అంతా నిరామయంగా వుంది. ఎటుచూసినా మేము ఎక్కడా కొంచెమైనా వంకరలేని ఒక మహా వలయంమధ్య చిక్కుకున్నట్లనిపించింది. సముద్రమూ, ఆకాశమూ కలిసిపోయి ఒక వలయంగా కనిపిస్తోంది. ఆ వలయానికి సరిగ్గా మధ్య మేమున్నాము. మా విమానం అపరిమితమైన వేగంతో ప్రయాణం చేస్తోంది. ఎంత వేగంతో పోతున్నా, మేము మాత్రం వలయ మధ్యభాగాన్ని దాటిపోవడం లేదు. ఒక్క అంగుళమైనా ముందుకు జరుగుతున్నట్లే లేదు. ఎంత ఆలోచించినా దీనికి కారణం బోధపడలేదు. కారణం బోధపడనివి జరుగుతున్నప్పుడు ఎంత భయం కలుగుతుందో అందరికీ తెలిసిన విషయమే.

అంతా నిశ్శబ్దంగా, నిశ్చలంగా వున్నది. ఆ నిశ్చల నిశ్శబ్దతలో మాకు గట్టిగా మాట్లాడుకోడానికి కూడా ధైర్యంచాలక, మెల్లిగా గుసగుసలాడసాగాము. గుసగుసలాడినకొద్దీ ధైర్యం సన్నగిలిపోతోంది. ధైర్యం సన్నగిలినకొద్దీ మెల్లిగా మాట్లాడుతున్నాము. ఈవిధంగా చివరకు మాలో ధైర్యమనేది కంచుకాగడా వేసినా కానరాకుండాపోయింది. మాట్లాడుకోవడం కూడా పూర్తిగా మానివేశాము. అలాగే ముడుచుకుని కూర్చుని ఆలోచిస్తున్నాము. అంత దీర్ఘకాలం మాట్లాడుకోకుండా మేమెన్నడూ కూర్చోలేదు.

సూర్యుడు సరిగా నెత్తిమీదికి వచ్చాడు. అంతవరకూ కిమ్మనకుండా కదలకుండా కూర్చున్న ప్రొఫెసరు లేచి నుంచున్నాడు. త్రిభుజాకారంలో వున్న ఒక యంత్రంతీసి కంటికి దగ్గిరగా పెట్టుకున్నాడు. అది మధ్యాహ్న రేఖలను, అక్షాంశ రేఖలను కనిపెట్టే యంత్రమనీ, దాని సహాయంతో మనం ఏ ప్రాంతంలో ఉన్నదీ తెలుసుకోవచ్చునీ టామ్ అన్నాడు. ప్రొఫెసరు కాగితం తీసుకుని ఏవో లెక్కలువేశాడు. తరవాత ఏదో పుస్తకంతీసిచూశాడు. అదయిన తర్వాత మళ్ళీ అర్థంలేని వాగుడు సాగించాడు. తన విమానం గంటకు నూరుమైళ్ళ వేగంతో పోతోందనీ, ఈ వేగాన్ని రేపుసాయంత్రందాకా ఉంచుతాననీ, ఆ వెంటనే లండన్ నగరంలో రథాన్ని వాల్తాననీ కోతలు కోశాడు.

అలాచేస్తే మీరు బతికున్నంతకాలమూ కృతజ్ఞులమై వుంటామని మేమన్నాము.

ప్రొఫెసరు ఆ మాట వినగానే అటు వెడుతున్నవాడల్లా గిరుక్కున మాకేసి తిరిగాడు.

కళ్ళల్లోంచి నిప్పులు రాల్తున్నట్లు మాకేసి దీర్ఘంగా చూశాడు. అతని మనస్సులో ఏదో అనుమానం మెదిలింది. "మీరు నన్ను విడిచిపెట్టి పోదామనుకుంటున్నారు కదూ? నిజం చెప్పండి," అన్నాడు.

ఏం చెప్పడానికీ మాకు తోచలేదు. అందుచేత కిక్కురుమనకుండా దగ్గిరదగ్గిరగా జరిగి నుంచున్నాము.

# ★ టామ్ సాయర్ ప్రపంచ యాత్ర ★

ప్రొఫెసరు వెనక్కి తిరిగి యథాస్థానానికి వెళ్ళి కూర్చున్నాడు. కాని మా మీద కలిగిన అనుమానం అతన్ని విడిచిపెట్టలేదు. ఉండుండి మమ్మల్ని కసిరి మా చేత సమాధానం ఇప్పించాలని ప్రయత్నించే వాడు. కాని మేము మాత్రం నోరెత్తలేదు.

ఆ పగలు ఎంత నెమ్మదిగా, దిగులుగా గడిచిందో చెప్పలేను. గుండెలమీద ఏదో భారంవున్నట్టు అణగారి పోయాము. చీకటిపడుతున్న కొద్దీ మాకు దిగులెక్కువైంది. కొంతసేపైన తరవాత టామ్ నన్ను గిల్లి "అటు చూడు" అన్నాడు.

నేను వెనక్కి చూశాను. ప్రొఫెసరు ఒక సారా సీసా ముందు పెట్టుకుని గడగడ తాగేస్తున్నాడు. అతడలా తాగడం నాకు ఆందోళన కలిగించింది. ప్రొఫెసరు మళ్ళీ తాగాడు. కైపు తలకెక్కి పాటలు పాడసాగాడు. అప్పటికి బాగా చీకటిపడింది. తుఫాను సూచనలు కనిపించాయి. ప్రొఫెసరు ఇంకా వెర్రిగా పాడుతున్నాడు. ఉరుముల ధమధమ ధ్వనులు ఎక్కువైనాయి. గాలి రయ్యిన వీస్తూ విమానపు తాళ్ళను బలంగా ఊపేస్తున్నది. చీకట్లో ప్రొఫెసరు కనిపించడం లేదు. అతని గొంతుకకూడా వినిపించడం మానేస్తే బాగుంటుందని అనుకున్నాము. కాని అలా జరగలేదు. కొంతసేపు అలాగే పాటలు పాడుతూవున్నాడు. అకస్మాత్తుగా పాట ఆగిపోయింది. పదినిమిషాలసేపు నిశ్శబ్దంగా వున్నాడు. మాకు అనుమానం కలిగింది ఏమైనాడోనని. అతడు పాడుతూవున్నా బాగుండిపోను. ఎక్కడున్నాడో, ఏంచేస్తున్నాడో తెలిసేది అనుకున్నాము. ఇంతలో మెరుపు మెరిసింది. ప్రొఫెసరు ఉలికిపడి లేవబోయాడు. కాని మంచి నిషాలో ఉన్నందున తూలిపడిపోయాడు. పడి ఇలా అరిచాడు: "వీళ్ళకి ఇంగ్లండు వెళ్లడం ఇష్టంలేదట. సరే, చూస్తా, వీళ్ల పని పట్టిస్తా. నేను దారి మార్చేస్తా.. నన్ను విడిచిపోదామనుకుంటున్నారుగదూ? సరే, నా తడాఖా చూపిస్తా" అని ఆగాడు. కొంతసేపటిదాకా మళ్ళీ నిశ్శబ్దంగా వున్నాడు. అలా ఎంతసేపైందో చెప్పలేను. ప్రొఫెసరు ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియలేదు. మళ్లీ మెరుపు మెరిస్తే బతికిపోదామనిపించింది. చివరికి మళ్ళీ మెరిసింది. ప్రొఫెసరు చేతులతో, కాళ్లతో పాకుతుంటూ మావేపు వస్తున్నాడు. మాకు నాలుగడుగుల దూరంలో ఉన్నాడు. అతని కళ్లలో తీవ్రమైన క్రోధాగ్ని ప్రజ్వలిస్తోంది. హఠాత్తుగా టామ్ మీదికి దూకి "పో సముద్రంలో పడు" అని కేక వేశాడు. మెరుపు మెరిసినంతలో ఇదంతా జరిగింది. మళ్లీ కారు చీకటి కమ్ముకుంది. టామ్‌ను కిందికి తోసివేశాడో లేదో నాకు తెలియలేదు, కాని టామ్‌నుండి ఏ శబ్దమూ వినబడలేదు.

మళ్ళీ చాలసేపు ఆ చీకట్లో అందరం కాచుకొని వున్నాము. ఇంతలో మరొక మెరుపు మెరిసింది. విమానం వెలుపలి భాగాన టామ్ తల క్షణంసేపు కనిపించి మాయమైంది. విమానంనుండి కిందికి వేళ్లాడుతున్న తాడునిచ్చెనమీద టామ్ ఉన్నాడు. ప్రొఫెసరు టామ్‌ను చూడగానే మళ్లీ ఒక అరుపు అరిచి అతనిమీదికి దూకాడు. మళ్లీ కటిక చీకటి. జిమ్ గద్గద కంఠంతో "టామ్‌సాయర్ గారు పోయినట్టే, పాపం" అని మూలిగి, ఒక్కసారిగా కుప్పించి ప్రొఫెసరు మీదికి లంఘించాడు. కాని ప్రొఫెసరు అక్కడ వుంటేగా?

తరవాత భయంకరమైన అరుపులు రెండు వినిపించాయి. కొంత ఆగినతర్వాత మళ్లీ వినిపించాయి. ఈసారి కింద ఎక్కడినుండో వస్తున్నట్టు అస్పష్టంగా వినిపించాయి. జిమ్ మళ్లీ "పాపం టామ్‌సాయర్ గారు!" అని గద్గదంగా అన్నాడు.

మళ్లీ అంతా నిశ్శబ్దమైంది. మెరుపు మెరుస్తుందేమోనని అందరం ఎదురుచూస్తున్నాము. మళ్లీ మెరిసింది. జిమ్ మోకరించి, చేతులతో ముఖం కప్పుకుని ఏడుస్తున్నాడు కింద వేళ్లాడుతున్న నిచ్చెనవైపు చూద్దామనుకుంటుండగానే మళ్లీ చీకటైపోయింది. చూడకపోవడమే మంచిదనుకున్నాను; చూస్తే ఏ భయానక దృశ్యం కంటపడేదోననిపించింది.

ఇంకొకసారి మెరిసింది. కిందికి చూశాను. టామ్ నిచ్చెనమీద నుంచుని తాళ్లు గట్టిగా పట్టుకుని గాలిలో అటూయిటూ ఉయ్యాల ఊగుతున్నాడు.

"పైకి రా, టామ్! పైకి రా" అని గట్టిగా అరిచాను.

టామ్ సమాధానం చెప్పాడు. కాని అతని కంఠం బలహీనంగా ఉండడంవల్లా, గాలి బలంగా వీస్తు

న్నందువల్లా బాగా వినిపించలేదు.'ప్రొఫెసరు అక్కడే ఉన్నాడా?' అని అడిగినట్లు అనుకున్నాను.

"లేదు సముద్రంలో పడిపోయాడు. పైకి రా," అని అరిచాను.

"హక్! నువ్వు ఎవర్ని పిలిచేది?" అని జిమ్ అడిగాడు.

"నేను టామ్‌ను పిలుస్తున్నాను," అన్నాను.

"అదేమిటి హక్! టామ్‌గార్ని పిలుస్తున్నావా? పాపం ఆయన—"అని జిమ్ గద్గదికంగా అంటూండగానే మెరుపు మెరవడం, అప్పుడే నిచ్చెనమీదుగా మెల్లిగా పైకివచ్చిన టామ్‌ను జిమ్ చూడడం, తెల్లగా పాలిపోయివున్న టామ్ ముఖంచూసి అది టామ్ తాలూకు దయ్యమనుకుని జిమ్ హడలిపోయి "అమ్మో" అని అరవడం, అంతా ఒక్కక్షణంలో జరిగింది.

టామ్ దగ్గిరకి రాగానే, జిమ్ అతన్ని ముట్టుకుని చూసి దయ్యంకాదనీ, టామ్ బతికేవున్నాడనీ గ్రహించి కావిలించుకుని, ముద్దుపెట్టుకుని, ముద్దుమాటలు అని సంతోషంతో పిచ్చెక్కినంతపని చేశాడు.

నేను టామ్‌ను అడిగాను: "టామ్! ఎందుకంత సేపు నిచ్చెనమీదే నిలబడ్డావు? నేను పిలవగానే పైకి రాలేదేం?"

"నేను అక్కడ నుంచునివుండగా నా పక్కనుంచి ఎవరో దూసుకుని పడిపోవడం చూశాను. ఆ చీకట్లో అది నువ్వైందీ, జిమ్ అయిందీ తెలియలేదు."

టామ్‌సాయర్ పద్ధతే అంత. ఎప్పుడూ తార్కికంగానే ఆలోచిస్తాడు ప్రొఫెసరు ఎక్కడుందీ తెలుసుకున్న తరవాతగాని పైకి రాలేదు.

తుపాను విజృంభించింది. వాయువు ప్రచండంగా వీస్తోంది. పిడుగులు, ఉరుములమోతలతో చెవులు చిల్లులుపడుతున్నాయి. మెరుపులతో కళ్లు బైర్లు గమ్ముతున్నాయి. ఒక క్షణంలో మన చెయ్యి మనకే కనిపించదు. రెండోక్షణంలో మన చొక్కా గుడ్డలో ఎన్ని దారాలున్నాయో స్పష్టంగా కనిపిస్తాయి. మామూలుగా అయితే ఇటువంటి గొప్ప తుపానును కళ్లారాచూడడం అదృష్టంగానే భావించాలి. కాని ఆకాశంలో రాత్రివేళ దిక్కులేని పక్షుల్లాగ సంచరిస్తూన్న సమయంలో, అందులోనూ తోటివాడొకడు దుర్మరణానికి లోనైన సమయంలో అంత కంటె దురదృష్టంలేదనే అనిపిస్తుంది.



తుపాను విజృంభించింది. వాయువు ప్రచండంగా వీస్తోంది. మెరుపులతో కళ్లు బైర్లు గమ్ముతున్నాయి.

మేము ముగ్గురమూ ఒకమూల నక్కి ముడుచుకొని కూర్చున్నాము. ప్రొఫెసరు పోయినందుకు, అతన్ని ప్రజలు పిచ్చివాడికింద కట్టి వేళాకోళం చేసినందుకు విచారించాము. తనకు తోచినపని మంచికో, చెడుకో చేశాడు. ఒక చల్లని మాటమాట్లాడే స్నేహితుడుగాని, ప్రోత్సాహమిచ్చి వీపుతట్టే అప్తుడుగాని లేకుండా తనపని తాను నిర్వర్తించాడు. తనకు జరిగిన అవమానం తలుచుకుని తలుచుకుని పిచ్చివాడయ్యాడు. అటువంటివాడు పోయినందుకు ఎంతగానో విచారించాము.

అవతలి చివర, ప్రొఫెసరు నివసించినచోట కావలసినన్ని బట్టలు, దుప్పట్లు ఉన్నాయి. అయితే వానలో తడిసి చివికిపోవడానికైనా సిద్ధపడ్డాముగాని, ఆ వైపుపోవడానికి మనసొప్పలేదు. చచ్చిపోయిన ప్రొఫెసరు అప్పటి దాకా ఉపయోగించిన స్థలంలోకి వెళ్లడానికి మాకు ధైర్యం చాలలేదు. అక్కడికి వెడితే ప్రొఫెసరు తాలూకు దయ్యం అడ్డగిస్తుందని జిమ్ అన్నాడు. 'చావనన్నా చస్తానుగాని దయ్యాలతో దెబ్బలాట పెట్టుకో'నన్నాడు జిమ్. (ఇంకావుంది)

# నాన్న ముద్దు

**తాడేపల్లి వజ్రాబాయి**

కనీసం రోజుకు పదితడవలైనా తన్ను ముద్దెట్టుకుంటోంది తల్లి. కాని నాన్న తన్నెందుకసలు ముద్దెట్టుకోడో రామానికి అర్థమయ్యేదికాదు. తనతల్లేకాదు వాడలోనివాళ్లందరూ రామాన్ని చూడగానే — "తెల్లదొర వచ్చాడు" అంటూ వాణ్ణెత్తుకొని ఆ చెంపా ఈ చెంపా గట్టిగా ముద్దెట్టుకునేవారు. బళ్లో మాష్టార్లందరూ రామాన్ని ముద్దెట్టుకునేవారు. బడిబంట్రోతు రామాన్ని భుజాలమీద కూర్చోబెట్టుకొని, తమాషా తమాషా మాటలు చెబుతూ, సాయంకాలం ఇంటికి తెచ్చి వదలిపెట్టేవాడు. రంగయ్యసాహుకారు కూడా రామాన్ని, బడికి పోతూన్నప్పుడల్లా, పట్టుకొని గట్టిగా బుగ్గలుకొరికి, వాడేడ్చేవరకి "మా బాబు, మా బాబు," అంటూ మూడో నాలుగో బలపాలుయిచ్చి బడివరకు పంపించిపోయేవాడు. ఇంటి చాకలిమునిమి నాగమ్మకూడా రామాన్ని ముద్దాడకుండా పోయేది కాదు ప్రతినిత్యం. కాని నాన్న మాత్రం రామాన్ని ముద్దెట్టుకోడు. పైగా రుస్సడూ— "ఏదీ పాఠం చదివావా? చూచివ్రాత రాశావా?" అని కేకలేస్తూ వుంటాడు. నాన్నకు తనమీద అంతకోపం ఎందుకో రామానికి అర్థంఅయ్యేది కాదు.

రామానికి ఏడేళ్లు, దబ్బపండులా వుంటాడు. వాడికళ్ళు, ముక్కు చాలా అందంగా వుండి, బుగ్గలు మిసమిసలాడుతూ వుంటాయి. వాడి కంఠం కోకిల కంఠం. వచ్చీరాని పద్యాలూ, పాటలూ, చదవమనడం ఆలస్యం, గబగబా చదివేవాడు, వాడిచేత పద్యాలు చదివించి, విని ఆనందిద్దామని ఆ వూరి వైద్యుడు పడమటి బజారునుంచల్లా, ప్రతిరోజూ వచ్చేవాడు.

తననందరూ ఆవిధంగా ప్రేమిస్తూన్నందుకు రామం సంతోషించేవాడు. కాని వూళ్లోవాళ్లందరు తనన్ని ముద్దులు పెట్టకున్నా, తల్లి తననెంత గారాబంతో చూచినా, నాన్నగారు తననెందుకు ముద్దెట్టుకోరా అని వాడి అనుమానం.

రామం లేతహృదయంలో ఈ అనుమానం ఆవేదనగా మారింది. నాన్ననే అడిగి తెలుసుకొని ఈ ఆవేదనను దూరంజేసుకుంటా మనుకున్నాడు. కాని నాన్నంటేనే భయం! ఇక అడిగి తెలుసుకోవడ మెలా?

ఒకరోజు రామం వాళ్ళ ఇంటి అరుగుమీద కూర్చొన్నాడు. నాన్న చిన్నప్పుడు తననెప్పుడైనా ముద్దెట్టుకున్నాడా లేదా అని ఆలోచించసాగాడు. ఎంత ఆలోచించినా నాన్న తననెప్పుడూ ముద్దెట్టుకొన్నట్టు వాడికి గుర్తురాలేదు.

రామం కళ్లవెంట నీళ్ళు దూకసాగాయి. వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టాడు.



"ఆనేవాలే, జానేవాలే"

ఫోటో: ముప్ప బలరామకృష్ణరావు—విజయవాడ.

దగ్గరలో కాఫీకప్పులు కడుగుతూన్న రాముంతల్లి వాడియేడుపు విన్నది. గబగబా పరుగెత్తుకుంటూ వాడిదగ్గరకు వచ్చింది. దగ్గరకు తీసుకుంది. "యేమిట్రా రాముం! యెందుకు యేడుస్తున్నావు?" అని అడిగింది లాలిస్తూ.

రాముం మరింత గట్టిగా యేడువసాగాడు. తల్లి ఓదార్చినకొద్దీ వాడి యేడుపు యెక్కువకాసాగింది.

అరగంటసేపటికి వాడి యేడుపు వడితగ్గింది. వెక్కిళ్లు పట్టుకున్నాయి.

"ఏంరా నాన్నా! మా బాబు చెప్పరా యెందుకేడ్చావో" అని తల్లి తలనిమురుతూ వొళ్ళోకి తీసుకొని అడిగింది.

వెక్కిళ్ళమధ్యన, రాముం తల్లికి తన హృదయ వేదనను తెలియబర్చాడు.

తల్లి చిరునవ్వు నవ్వింది. వాడి బుగ్గలను పదే పదే ముద్దెట్టుకుంది.

"నా తండ్రీ! యిదా నీ ఆరాటం!" అని రామాన్ని ఎత్తుకుంది. ఆ తల్లికళ్లు జలపూరితములయ్యాయి.

"నాన్నా! నీవు రోజూ పెందరాళే పడుకుంటావు. ఈరోజు మీనాన్న వచ్చేవరకు మెలకువతోవుంటే నీ అనుమానం తీరుతుంది," అని తల్లి నవ్వుతూ చెప్పింది.

రాత్రి తొమ్మిదిదాటింది. చదువులు చెప్పడం ముగించుకొని నాన్న వచ్చేవేళ అయిందని రామానికి తల్లి చెప్పింది. రాముం దొంగ నిదుర పోసాగాడు.

ఇంతలో రాముంనాన్న వచ్చాడు. కోటువిప్పి వంకెకు తగిలించి, బూట్లు విప్పుకొని చక్కగా టేబిలుదగ్గరకు పోయాడు. రాముం పుస్తకాలసంచీ తీశాడు. దీపం కాస్త పెద్దదిగా చేశాడు. రాముం ఆరోజు వ్రాసిన కాపీలనుచూచాడు. చిరునవ్వు నవ్వుతూ రాముం పడుకున్న మంచందగ్గరకు పోయాడు. వాడి రెండువైపులా చేతులనానించి —"మా బంగారు రాజా! యెంత చక్కగా రాశావురా" అని వాడు లేస్తాడో యేమోనన్న భయంతో, నెమ్మదిగా రాముంబుగ్గలను ముద్దెట్టుకున్నాడు. చేతులను మెల్లగా తీస్తూ—"మా నాన్నను ఎం. ఏ. చదివిస్తా. వాణ్ణి మహా పండితుణ్ణిచేస్తా" అని అన్నాడు.

రాముం అంతా చూస్తూనే వున్నాడు. వాడికి వాళ్ళనాన్న అన్న మాటలన్నీ తెలిశాయి. కాని "ఎం. ఏ;" అని "మహాపండితుణ్ణి"అని అన్నమాటలు అర్థంకాలేదు. పోనీ అనుకున్నాడు. మా నాన్నైతే నన్ను ముద్దెట్టుకున్నాడని అపరిమిత ఆనందం పొందాడు. వాడి అమాయికవదనం కలువపువ్వులా వికసించింది, వాడి పెదిమలమీద కమ్మని చిరునవ్వు వింతసోయగంతో నాట్యంచేసింది. వాడు సంతోష సాగరాన మునకలేస్తూ తన చిన్ని చిన్ని చేతులతో ముఖాన్ని కప్పుకొని వత్తిగిలాడు. ★

# ప్రతిఫలం

"ద్వారకా"

చాలాకాలం క్రిందట గ్రీసు దేశాన్ని జాన్ అనే చక్రవర్తి పరిపాలించాడు. అతని పరిపాలనలో దేశం చాలా సుఖపడ్డది. గ్రీకు ఖజానా పొర్లిపోయింది.

సర్వసంపదలతో తులతూగిపోతున్న చక్రవర్తికి తాను నివసిస్తున్న పాతభవనం యేమాత్రం బాగుండలేదని తోచింది. తన దర్జాకు తగిన సుందరభవనం వేరే కట్టించాలని అనుకున్నాడు. ఎంత ధనమయినాసరే ఖర్చుచేయటానికి సిద్ధపడ్డాడు. భవనం నిర్మించటానికి అనువైనస్థలంకోసం జాన్ రాజ్యమంతా విసుగూ, విరామం లేకుండా అన్వేషించాడు.

చివరికి ఒక చక్కని ప్రదేశం కనిపించింది. విశాలమైనస్థలం. ముందు వెనుక కంటికి ఇంపయిన సుందరదృశ్యాలు. చక్కని పరిసరాలలో ఇమిడివున్నది. కాని దాని ప్రక్కనే బీదవృద్ధురాలి కుటీరం ఒకటి ఉన్నది.

తన ప్రక్కనవున్న ఉద్యోగులతో "ఈ స్థలం నాకు నచ్చింది. ఆ కుటీరం తీసేస్తే చాలాబాగుంటుంది." అని చెప్పాడు జాన్.

ఉద్యోగులు వృద్ధురాలిదగ్గరకు పోయి ఆ విషయం తెలియజేశారు. ఆవిడ ఏడుస్తూ రాజుగారికాళ్ల మీద బడింది.

"మహారాజా! ఈ కుటీరం ఎప్పుడో మా తాతముత్తాతలు కట్టించారు. కళ్లారా ఈ యిల్లు



కడలి ఒడ్డున ఒడలుమరచిన బుడుతడు

—ఫోటో: గోపాల్, మద్రాసు

చిన్నపిల్లల టీచరు: మధు! నీకెంతవరకు అంకెలువచ్చాయో చెప్పు.

మధు: 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, జాకీ, క్వీను, కింగు.

— కె. వేణుగోపాల్‌రావ్, కోడంబాక్కం.

*　　*　　*

"నాన్నా!...నాన్నా!! నేను వారిమీద అలిగి వచ్చేశాను. అమ్మా!!...అమ్మా!!...అమ్మ ఏదీ నాన్నా?"

"అది నామీదఅలిగి నిన్న నే పుట్టింటికి వెళ్లిపోయింది"

*　　*　　*

మాయంకావటం నేను చూడలేను. నా ప్రాణంతో సమానమయినది ఈ గుడిసె. దయతో మన్నించండి. మీరు మహారాజులు! మీ చిత్తం, మా భాగ్యం" అని.

చక్రవర్తి ప్రక్కనఉన్న ఉద్యోగస్థులందరూ ఆ ముసలిదాన్ని చూచి ఎగతాళిచేశారు. నోటికి వచ్చినట్లల్లా మాట్లాడారు. చక్రవర్తి ఆ గుడిసెను తప్పక పీకిపారవేసి స్థలాన్ని ఆక్రమించుకొంటారని అనుకున్నారు. చక్రవర్తి కొంతసేపు మౌనంగా ఉన్నాడు. తరువాత వారందరికీ ఎంతో ఆశ్చర్యం కలిగేటట్లు ఆయన ముసలావిడతో ఇలా చెప్పారు.

"అవ్వా! నీ కుటీరంలో నీవు నివసించవచ్చును. అందుకు నీకు హక్కుఉన్నది. నీ కుటీరం ప్రక్కనే నా భవనం నిర్మించుకుంటాను. నా రాజభవనం ప్రక్కన నీ పూరిగుడిసె ఉన్నంతమాత్రాన నా భవనానికి లోటు కలుగదు. కలిగినా ఫరవాలేదు. అందువల్ల నా భవనం ఆకర్షణ సన్నగిల్లినా అంతమాత్రాన నామీదఉన్న గౌరవానికి లోటు రాదు. కదా!"

చక్రవర్తి తనమాట నిలుపుకున్నాడు. ఆ పూరిగుడిసె ప్రక్కనే రాజభవనం వెలిసింది. పేరుప్రఖ్యాతులతో జాన్ ఎంతో కాలం రాజ్యాన్ని పరిపాలించాడు.

కిరీటంగల తలచుట్టూ ఎప్పుడూ ఆపదలు గుమిగూడిఉంటాయి. చక్రవర్తి మంత్రులిద్దరు ప్రభువుపై కుట్రపన్నారు. ఆ పేదరాలి పూరిగుడిసె ప్రక్కన కూర్చొని, వారు జాన్ రాజును హత్యజేసి అతడిరాజ్యాన్ని ఏవిధంగా అపహరించాలో పథకం తయారుచేశారు. ఇంట్లోనుంచి కాలు బయట పెట్టలేని ఆ మూడు కాళ్ల ముసలమ్మ వారి మాటలన్నింటిని విని, రాజుగారికి తెలియజేసింది. రాజుగారిని హత్యచేయదలిచిన ఆ మంత్రులిద్దరికీ కాలం తీరింది. ఈ విధంగా జాన్‌చూపిన ఔదార్యానికి తగు ప్రతిఫలం లభించింది.

"ఇతరుల న్యాయమయిన హక్కులకు భంగం కలిగించకుండా ఉండేవారే నిజమయిన తెలివిగలవారు. ఒకనాడు ఆ వృద్ధురాలికి తన గుడిసెమీదగల హక్కును కాపాడాను. ఈనాడు ఆ వృద్ధురాలు నాకు నా సింహాసనం మీదగల హక్కును కాపాడింది! అని కృతజ్ఞతతో జాన్ ఆమెను ప్రశంసించాడు. ★



సినిమా
1.
2. అదిగో! అక్కడ ఖాళీగా వుంది!!!
3. తెరముందు నేను!!! అయ్యో అప్పుడే పిల్లాడు కూడా పుట్టాడే!
4. ఆయన కాళ్ళు ఆయన నెత్తిన!!!
5.
జగన్

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 197. మన శాస్త్రాలు

"ఎందుకో గాని మీకు మన శాస్త్రాలమీద మహా అక్కసుగా వుంది. ఎందుకండీ అలాగు తిట్టుతున్నారూ?" అని "శ్రేయోభిలాషులు ఒకరు" మందలించారు. వారికి నా జవాబిది: "మీరు నా శ్రేయోభిలాషులని నాకు బాగా నమ్మకము. లేకుంటే నా 'తప్పు' ను వేలుపెట్టి చూపించరు. అభిమానులు నాలోని అవగుణాన్ని సహించేసి ఊరుకుంటారు. అందువల్ల అవగుణము సుగుణము అవుతుందా? అవగుణాన్ని - అక్కసుకూడా అవగుణమే (కారణము లేకపోతే!) - వేలుపెట్టి చూపించారు. కృతజ్ఞుడను. అయితే "తిట్టకుండా (ఊరికే అంటేనూ తిట్టు. పత్తివాణ్ణి పత్తివాడా అంటే తిట్టా?) రాస్తాను మన శాస్త్రాల సంగతి. చిత్తగించండి.

'సంగీత శాస్త్రము' చూచాను. నాకు సంగీతము రాదు. "అయితే ఎందుకు చూశావూ?" అంటే "ఏమిటో తెలుసుకోటానికి." దానిలో చెప్పుకొచ్చారు రచయితలు. ఇవి వారి స్వకపోల కల్పితాలు మట్టుకు కావు. "నారదీయ సోమనాథీయములలోన, వలయువాని...గూర్చి" యే రచించినారు. కర్తలు. ఆ గ్రంథములోని ఒక పట్టిక.

| స్వరము | జాతి | వంశము | దేవత | ద్వీపము(!) | వృక్షము!! | ఛందస్సు |
|---|---|---|---|---|---|---|
| స | బ్రాహ్మణ | దేవ | అగ్ని | జంబు | మామిడి | అనుష్టుప్ |
| రి | క్షత్రియ | ఋషి | బ్రహ్మ | శాక | ఖర్జూర | గాయత్రి |
| గ | వైశ్య | దేవ | సరస్వతి | కుశ | అరటి | త్రిష్టుప్ |
| మ | బ్రాహ్మణ | దేవ | శివుడు | క్రౌంచ | నిమ్మ | బృహతి |
| ప | బ్రాహ్మణ | పితృ | విష్ణువు | శాల్మలి | దాడిమ | పఙ్క్తి |
| ధ | క్షత్రియ | ఋషి | వినాయక | శ్వేత | ద్రాక్ష | ఉష్ణిక్కు |
| ని | వైశ్య | రాక్షస | సూర్య | పుష్కర | పొన్న | జగతి |

ఇంకా స్వరాల భోజనము, వస్త్రము, విలేపనము, పుష్పము, భూషణము, ఆయుధము, వాహనము, భార్య (!) దేహము, గురించి చెప్పే రెండు వేరే పట్టికలున్నాయి. వీటిభావము బోధకాలేదు. దయచేసి చెప్పండి. పోనీ సంగీతము వదిలేద్దాము. సాహిత్యశాస్త్రము చూద్దాము.

కవి జనాశ్రయము వేములవాడ భీమ కవిదంటారు, కాదట; మల్లియరేచనదట.

ఆ గ్రంథములో గణములకు అధిదేవతలు, గణముల - శుభ, సుఖ, క్షయ, ధన, ఆది - ఫలములూ, గణముల వర్ణములూ, గణముల గ్రహములూ, గణముల కులములూ, గణ గోత్రములూ, గణముల మనుష్య రాక్షసాది జాతులూ, గణముల నక్షత్రములు, గణముల రాసులూ, గ్రహముల మృగములూ, చెప్పబడి యున్నవి. ఇదంతా గమనిస్తే గణాలూ, పర్వతాలూ, దేశాలూ, రాసులూ, గ్రహాలూ, జాతులూ, మృగాలూ, చెట్లూ, నదులూ, తెలిసినవన్నీ పట్టి వేసి వాటిలో వాటికి బాంధవ్యము సాధించినట్టు కనబడదూ? లేకుంటే వారమూ, రంగూ ఇత్యాదులకూ స్వరాలకూ వేరే సంబంధమేమిటి?

ఇక దినమునకు గల వివిధవిభాగాలు ఉదయము, మధ్యాహ్నమూ ఇత్యాది సమయాలలో పాడవలసిన రాగాలు నిర్ణయించినట్లే, గణములకుకూడా శుభాశుభాలు నిర్ణయించి మొదట ఏది వేయ్యాలో ఏదికూడదో రాశారు ఛందోశాస్త్రాలలో. మచ్చుకి ఒక్కటి: "మొదల సంయుక్త వర్ణంబు పొందెనేని, మరవ కారెంటికిని గ్రహమైత్రివలయు, నిది విచారింపరేని కృతీశ్వరుండు, పిడుగు మొత్తిన గతిగూలు బిట్టబిట్టు.

ఫలమంతా కృతిభర్తకి తగులుతుందిట, పనిమాత్రము కృతికర్త అనగా కవిది! నాకు జూసగా ఈ భయాలు కవికి గౌరవముకోసమున్నా ఇంకెవరూ కవిత్వరచన జోలికి రాకుండానూను అనిపిస్తోంది.

అయితే యిలాటి శాస్త్రాలు పరమశివుడో, విష్ణుమూర్తియో చెప్పినవే అందామా? ఋషులు తపస్సువల్ల సాధించినవందామా?

"వీటి నేం చేయ్యాలి?" అని అడిగితే "తగలబెట్టాలి" అని జవాబువస్తుం దనుకుంటారు స్థూలదృష్టితో 'విజ్ఞాన వీధులు' పరికించినవారు. కాదు. కానే కాదు. శాస్త్రాలుఅన్నీ మానవులు-మన పూర్వులు-రాసినవే. అవన్నీ దైవదత్తాలని నెత్తిమీద పెట్టుకు పూజించడము వెర్రి. పూర్వ మానవులు చేసినవన్నీ తగలబెడుతున్నామా? ఏవి మనకి ఉపయోగముగా వుంటాయో అవి తీసుకుని తక్కినవి వదిలేయాలి. ఇవేవో నెత్తిమీది దేవత లెవరో రాసినవీ ఇచ్చినవీ కావు. పరిశీలనకూ వడపోతకూ తగినవే. ఆ పని జరగాలి. సంగీతశాస్త్రములన్నీ గాలించి వాటి నిగ్గూ, ఇలాగే తక్కిన శాస్త్రాలూ - వేదాంత శాస్త్రము సహా - తిప్పి రాసుకోవాలి.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## చిట్టిప్రశ్నలకు జవాబులు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

—శరీరములోని అంగము లన్నిటిని గూర్చి తెలియని రోజుల్లో ఊపిరి ఆగిపోవడమే మరణం అనుకొనేవారు. తరువాత గుండెకాయ కొట్టుకోకుండా ఆగిపోవడమే మరణమని నిర్ధారించుకున్నారు. నాడి ఆగిపోయిన అరగంటకు కాబోలు మృత శరీరము బిరబిగుస్తుంది. తాత్కాలికముగా గుండె ఆగిపోయిన రోగులను గుండెకాయకు ఇంజక్షను లిచ్చి బ్రతికించుట అన్నది ఉన్నప్పటికీ, గుండె ఆగిపోవడమే మరణము అన్న అభిప్రాయము సర్వత్రా అమలులో వున్నది.

ఐతే జీవశాస్త్రరీత్యా గుండె ఆగిపోయిన తర్వాత శరీరము బిరబిగియువరకూ గల స్థితిలో శరీరపు సంధులు మెత్తగానే వుండుటవల్ల శరీరము బిరబిగియువరకూ మరణము పూర్తి కాదని అనుకోవలసివస్తుంది. ఐతే ఈ మధ్య మనుష్యుడు చనిపోయిన 6 గంటలవరకునూ అతని చర్మము ఒలిచి ఇంకొకరోగి చర్మ లోపమును దానిని అతికి నివారించుటకు వీలున్నదని వైద్యశాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. మరణించిన వ్యక్తియొక్క కంటిలోని కటకములను రోగుల కండ్లను భర్తీచేయుటకై ఉపయోగించుచున్నారని మీకు తెలిసియే యుండును.

ఈ విషయముల నన్నింటినీ గమనించినచో మరణమన్నది శరీరాంగముల పూర్ణ ఐకమత్యమునకు భంగకారియైన సంఘటన మనీన్నీ, ఈ ఐకమత్యము నశించుటకు శరీరాంగము లన్నిటికీ వ్యాధి రానక్కరలేదనిన్నీ, ఏదో ఒక అంగమునకు తిర్చరాని చేటువాటిల్లినప్పుడు అంగముల మొత్తపు ఐకమత్యమునకు - అనగా బ్రతుకు

## చిత్రప్రశ్నలకు జవాబులు

నకు అపాయము వచ్చుచున్నదని తెలియుచున్నది. కలరా రోగికి శరీరములోనున్న నీరంతయు వమన విరేచనములద్వారా నష్టమగును. గుండె, ఊపిరితిత్తులు, మెదడు ఇవి, ఆ రోగ లక్షణములు వృద్ధియగుచున్నప్పుడు మెలకువగానే యుండి పనిచేయుచుండవచ్చునూ పనిచేయుచుండును కూడ. ఈ రీతిగానే టైఫాయిడ్ రోగికి చిన్న ప్రేగులు, మశూచి బాధితునికి చర్మము చెడిపోవును.

శరీరములో – ఈ దృష్టిని చూచినప్పుడు ప్రధానాంగము లేవి అన్నది చిత్రమైన ప్రశ్న. మానవుడు ఒకే ఊపిరితిత్తి పనిచేసినను బ్రతుకగలడు, ఒక మూత్రపిండమును తీసివేసినను బ్రతుకగలడు, చిన్నప్రేగులు కొంత కత్తిరించివేసినను బ్రతుకగలడు, రెండు కాళ్ళు రెండు చేతులూ శస్త్రము చేసి ఛేదించినను బ్రతుకగలడూ, మెదడులో కొన్ని భాగములు చెడిపోయినను బ్రతుకగలడు. అంటె ఈ భాగములు జీవవ్యాపారమునకు ఉండితీరవలెనన్న నియమము లేదన్న మాట.

—మరణానంతరము జీవశక్తి లోపించిపోవునని చెప్పుట తప్ప ఆశక్తి ఏమగునో చెప్పుటకు ఇప్పటికింకా ఆధారములు దొరకలేదు.

మంచుకొండ నరసింహారావు గారు—
హైదరాబాదు.

## గ్రంథస్వీకారం

దత్త: శరత్ రచన. అనువాదం "అరుణశ్రీ". వెల రు 1-8-0. జాగరణ: అనువాదం పురాణం. వెల 12 అణాలు. శరత్ అసంపూర్తి కథలు: అనువాదం శివరామకృష్ణ. వెల 12 అణాలు.

శరత్ బాబు రచనలు దాదాపుగా అన్నీ తెనుగులోకి అనువదించబడినాయి. శరత్ ప్రతిభావంతుడయిన రచయిత. ఆయన సృష్టించిన పాత్రలన్నీ మానవప్రకృతికి సన్నిహితంగాఉండి పాఠకుల ఆదరాభిమానములను చూరగొన్నాయి. ఈ అనువాదాలతో తెలుగులో ఒక ప్రత్యేకభాష తయారైంది. బెంగాలీ సంస్కృతానికి అపభ్రంశరూపమైన భాష. తెలుగుపై సంస్కృత భాషా ప్రాబల్యం ఎంత అధికమైనప్పటికీ, తెలుగుకు ఒక విశిష్టతఉన్నది. సంస్కృతభాషాపదాలు వివిధ భాషలలోనికి వచ్చినప్పుడు కొంత అర్థవిపరిణామంతో అవతరించినాయి అనువాదకులు శరత్ రచనలను తెనుగులోకి అనువదించినప్పుడు ఈ విషయం దృష్టిలో ఉంచుకొని బెంగాలీభాషలోకి చేరిన సంస్కృత పదాలను యథాతథంగా తెలుగులోనికి దిగుమతి చేయకుండా సరళమైన తెలుగు భాషలో వ్రాసి ఉండవలసింది. అప్పుడు సాధారణ తెనుగుపాఠకులు మరింత సులువుగా శరత్ బాబు ప్రతిభను గ్రహించగలిగేవారు. రచనావిన్యాసంలో, వాక్యనిర్మాణంలో అడుగడుగునా అనువాదమన్న భావన కొట్టవచ్చినట్లు స్ఫురిస్తుంటుంది. తెలుగులో వ్రాసిన తరువాత కూడ తెలుగురచనే అనిపించకపోవటం సమర్థించదగిన విశేషం కాదు.

దత్త అనే పుస్తకంలో నరేంద్రుడు స్త్రీ పాత్ర అయిన విజయతో ప్రసంగిస్తూ "నీలాంటి అన్యమనస్కురైన వ్యక్తిని నేనీ జన్మలో చూడలేదు." అని చెప్తాడు. దానిలోనే మరొకచోట 'భయభీత' అని ప్రయోగించారు. ఇటువంటిదోషాలను దిద్దుకోవటం చాలా అవసరం.

జాగరణ: శరత్ అసంపూర్తి రచన. ఇది పూర్తికాకముందే ఆయన దివంగతులు అయినారు. అనువాదప్రకాశకులు ఈ రచనను పూర్తిజేయ దలచినట్లు తెలుపుతూ పాఠకుల అభిప్రాయాలు తెలుపవలసిందిగా కోరారు. రచయిత అయితే పూరించి పంపవచ్చునన్నారు. ఇప్పుడు వ్రాసిఉన్నంతవరకు చూస్తే శరత్ అనుకున్న దానిలో నాలుగోవంతయినా పూర్తికాలేదని నిర్ణయించవచ్చును. శరత్ రచనలను ఎంత జీర్ణించుకొన్నవారయినా, ఇలా పూరించటానికి ప్రయత్నించటం కేవలం సాహసమే ఔతుంది. ఇందుకు కారణాలను ప్రత్యేకంగా వివరించవలసిన అవసరం లేదు.

అసంపూర్తి కథలలో నాలుగు కథలు ఉన్నాయి. అనువాదం చాలా అసంతృప్తికరంగా ఉన్నది. ఆదినుంచి తుదిదాకా చదవాలని కూడా అనిపించటం లేదని చెపితే చాలును.

హోలీ రేఖలు: (ఏకాంకికలు) రచయిత: మంచళ్ళ సుదర్శనాచార్యులు, బి.ఎ.బి.ఇడి. ప్రకాశకులు: దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్సు. సికింద్రాబాదు. 88 పేజీలు, వెల రు 1 0 0.

ఇందులో ఎనిమిది నాటికలు ఉన్నాయి. పురాణకథ ననుసరించి వ్రాసినవి, కల్పిత ఇతివృత్తంగలవి కూడా ఉన్నాయి. గ్రంథకర్త తాను ఈ నాటికలు రచించటంలో గల ఆంతర్యాన్ని తెలుపుతూ పీఠిక వ్రాసిఉండవలసింది. ఎక్కువభాగం రచన గ్రాంథికమే. కొన్ని చోట్ల వ్యావహారికంతో కలగలుపుగా ఉన్నది

## గమనిక

22-12-54 తేది వారపత్రికలో "మిత్రమా, కో-ఎగ్జిస్టెన్స్" అనే ఫోటోను పంపినవారు పి. రామారావు, రాజమండ్రి. అదే సంచికలో 38, 39 పేజీలలో కార్టూన్ చిత్రం వేసినవారు బాపు.

## శిల్పానికి చక్కిలిగింతలు

(11-వ పేజీ తరువాయి)

గి: ఇంకనోర్ముయ్యమన్నాను...

రా: ఆ మాస్తారు. ముయ్యరూ మరి. నా యిష్టం నాకష్టం నే అనుకుంటాను.

(నవ్వుతూ ఉంటుంది)

నేరాను మీతో సినిమాకి నాయిష్టం.

గి: ఫినోర్ముయ్... రాకపోతే దిగజోక్కేం లేదు.

(బట్టలు మార్చుకుని వస్తాడు)

(గది సన్యలో)

రా: (సీరియస్) గా

వెళ్తున్నారుగా తాళం చెవి ప్రక్కయింటి వాళ్ళకు యిచ్చి వెళ్తాను.

గి: ఎక్కడికి?

రా: నా యిష్టం వచ్చినచోటికి.

గి: (లెంపకాయ కొడ్తాడు. రాధ తప్పుకుంటుంది, గిరి తుళ్ళి తగిలి పడిపోతాడు రాధ నవ్వుతుంది.

రా: పాపం చెయ్యి వాచిందివి! నిజంగా మనిషికి వచ్చినంత కోపం వచ్చిందండీ నాకు ఏం?...సినిమాకి వెళ్దాం లేవండి. ఊరికే తమాషాకి అంతే... ఇటువంటి తమాషాలు లేకపోతే విసుగ్గా ఉంటుంది కదూ?...

(నవ్వుతుంది కిలకిలా)

గి: (నీరసంగా నవ్వుతూ...వంగి ఉన్న రాధ ముఖం ముందుకు వంచి ముద్దు పెట్టుకోబోతాడు.)

రాధ: (ముక్కుమీద వేలు వేసుకుని దూకుకుని కిలకిలా నవ్వుతుంది. గిరి నవ్వుతాడు.)

[శౌర]

# "అన్నదాత" సమీక్ష

శ్రీ అశ్వరాజ్ వారు నిర్మించిన "అన్నదాత" చిత్రం ఈ నెల 17 న ఆంధ్రలో విడుదలయి విజయవంతంగా నడుస్తోంది. అందరూ కలిసి అందరికోసం పనిచేస్తే దేశం సౌభాగ్యవంతమై నిత్యకల్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతుందని ఈ చిత్రం ప్రజానీకాన్ని ఉద్బోధిస్తుంది.

కాటకంతోనూ, జమీందారీ నిరంకుశత్వంతోనూ బాధపడుతున్న గ్రామప్రజలను బంగారయ్య అనే యువకుడు సమీకరించి, వారిలో సంఘీభావం పెంపొందించి, బీళ్ళన్నిటినీ దున్నించి పంటలు పండించి కరువు దూరమయ్యేట్లు చేస్తాడు. వ్యర్థంగా సముద్రంలో కలిసిపోతున్న నదీజలాలకు ఆనకట్ట కడితే క్షామపీడ శాశ్వతంగా తొలగిపోతుందని అతడు సంకల్పిస్తాడు. జమీందారు స్వతహాగా మంచివాడైనందున, అతనికి ఆర్థిక సహాయం చేయడమే కాకుండా ఇంజినీర్లనుకూడా తోడు ఇస్తాడు. కొన్నేళ్ళయ్యేసరికి గ్రామప్రజల నిరంతరకృషివల్ల ఆనకట్ట పూర్తయి బంగారయ్య కలలు ఫలిస్తాయి. అందరూ అతన్ని 'అన్నదాత' అని కీర్తిస్తారు. ఇది ఈచిత్రంలోని అసలు ఇతివృత్తం.

చిత్రం ప్రారంభంలో బంగారయ్య క్షామపీడితులకోసం గంజికేంద్రం నడుపుతాడు. అతనికి శాంత అనే దిక్కులేని యువతి సహాయపడుతుంది. ఇద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు. వారికొక ఆడపిల్ల కలుగుతుంది. గంజికేంద్రానికి ధనసేకరణకోసం నాటకాలువేస్తే బాగుంటుందని తలచి వారు కామయ్యనాయుడనే నటుడి సహాయం కోరుతారు. కొంతకాలమైన తర్వాత కామయ్యనాయుడికీ తన భార్యకూ రహస్యసంబంధం ఉందని అనుమానించి బంగారయ్య భార్యనూ, పిల్లనూ విడిచివెళ్ళిపోతాడు. కామయ్యనాయుడు తనభార్యకు పుట్టిన కోతిలాంటి నల్లపిల్లను శాంతకు తెలియకుండా ఆమెకు అంటకట్టి, ఆమె పిల్లను తన భార్యకిస్తాడు. శాంత బిడ్డ అన్నపూర్ణ కామయ్యనాయుడుదగ్గిర పెరిగి పెద్దదవుతుంది. ఆమెను రంగబాబు అనే అకతాయికిచ్చి పెళ్ళి చేయాలని నిశ్చయిస్తారు. ఆ పిల్లమాత్రం వేణుగోపాలస్వామి ఆలయంలో దేవదాసిగా జీవితం గడుపగోరుతుంది. కామయ్యనాయుడు కూతురైన నల్లపిల్ల శాంతవద్ద పెరుగుతుంది. ఈ పిల్లను రంగబాబు వలలో వేసుకుని చెరుస్తాడు. జమీందారుగారు మరణించిన తర్వాత రంగబాబు వారసుడయినందువల్ల అతని చేతికి జమీందారీ వస్తుంది. అతనికి కామయ్యనాయుడు సలహాదారుడవుతాడు. అన్నపూర్ణను కామయ్యనాయుడు బలాత్కారంగా రంగబాబుకు వివాహం చేయసంకల్పిస్తాడు. కాని బంగారయ్య అడ్డుపడి ఆమెను రక్షిస్తాడు. బంగారయ్యమీద పగ తీర్చుకోవడానికి, కొత్తగా జమీందారైన రంగబాబు ఆనకట్టను ధ్వంసం చెయ్యమని భటులకు ఆజ్ఞాపిస్తాడు. వారు దాన్ని ధ్వంసం చేయబోయేసమయంలో బంగారయ్య అడ్డుపడి ఆనకట్టను రక్షిస్తాడు. కామయ్యనాయుడి కుతంత్రాలు గ్రహించిన రంగబాబు చివరికి పశ్చాత్తప్తుడవుతాడు. బంగారయ్య తన భార్య సౌశీల్యవతి అని గ్రహించి ఆమెను స్వీకరిస్తాడు. రంగబాబు నల్లపిల్లను పెళ్ళిచేసుకుంటాడు. కామయ్యనాయుడుకూడా పశ్చాత్తాపపడి మంచివాడవుతాడు.

ఎన్ని సంఘటనలు, ఎన్ని పాత్రలు, ఎన్ని ఉపకథలు, ఈచిత్రంలో! వీటన్నిటి మధ్యపడి అసలు కథ కొసరుకథ అయిపోయింది. ప్రజలందరూ కృషిచేస్తే ఆహారసమస్యను తమంతట తామే పరిష్కరించవచ్చునని, అందుకు వారికి ప్రభుత్వంకూడా సహాయం చేస్తుందనీ ప్రధాన ఇతివృత్తం. ఇది సెమీడాక్యుమెంటరీ చిత్రానికి పనికివచ్చే వస్తువు. అలాంటి ఇతి



అన్నగారిమీద చెయ్యి చేసుకున్నందుకు వదినె మరదికి బుద్ధి చెబుతోంది.
"అర్థాంగి"లో జగ్గయ్య, సావిత్రి

## ★ "అన్నదాత" సమీక్ష ★

వృత్తాలంటే మనవారికి భయం. అసలు వస్తువుతో సంబంధం లేని అనేక సంఘటనలను, సన్నివేశాలను, పాత్రలను సృష్టించి జనబాహుళ్యానికి ఆమోదయోగ్యమని చెప్పబడే 'ఫార్ములా'లో ఈ చిత్రాన్ని తయారుచేశారు. ఎక్కువభాగం 'కామెడీ.' నాటక కళకు అంకితుడైన కామయ్యనాయుడు, 'ధింపటక ధింపటక' అని గంతులు వేసే అతని శిష్యుడు రంగబాబు, జాతకారణ్యంలో చిక్కుపడిపోయి ఇతర విషయాలేమీ పట్టించుకోని జమీందారు, సమయాసమయాలు చూసుకోకుండా 'ఏడుకొండలవాడా గోవిందా గోహోవింద' అని చేతులెత్తే 'కేతనామాత్యుడు' వీరందరూ ఈ చిత్రంలో హాస్యరసస్రష్టలై ప్రేక్షకులకు వినోదం అందిస్తారు. భర్తచేత అనుమానింపబడి, తన పిల్లకు దూరమై, తనది కాని బిడ్డను పెంచుతూ, అనుకోకుండా భర్తను చూడగలిగినప్పుడు ఆయన ఎదుటపడి ఆయనకు తలవంపులు తేవడానికిష్టపడక ఉచ్ఛిష్టాన్నం కళ్లకద్దుకుని భుజించి తృప్తిపడే శాంత పాత్ర స్త్రీ ప్రేక్షకుల హృదయాలకు హత్తుకుంటుంది. ఏనాటికీ పాతబడని సావిత్రీ సత్యవంతుల కథలోని ముఖ్య ఘట్టం ఈ చిత్రంలో నాటకరూపంలో చూపించబడింది. సత్యవంతుడి ప్రాణాలు యముడు తీసుకుపోవడం, సావిత్రి యముని చేత వరాలుపొంది భర్తను బ్రతికించుకోవడం చాలా చక్కగా చిత్రింపబడింది. యముడుగా రంగారావు, సావిత్రిగా అంజలీదేవి, సత్యవంతుడుగా నాగేశ్వరరావు వేషాలు వేసి చక్కగా నటించారు. నరకలోకం సెట్టు భారీగా నిర్మించి ఆ నాటకఘట్టం రక్తికట్టేట్లుగా దర్శకుడు శ్రద్ధతీసుకున్నారు.

ఈ చిత్రానికి నిర్మాత, కథకుడు కె. గోపాలరావు; దర్శకుడు వేదాంతం రాఘవయ్య; మాటలు, పాటలు మల్లా[illegible] వెంకటకృష్ణశర్మ, గాలి బాలసుందరరావు; సంగీతం ఆదినారాయణరావు. ఈ చిత్రాన్ని కీ|| శే|| మంగయ్యగారికి అంకితం చేశారు.

నటీనటుల్లో శాంతగా అంజలీ[illegible] బంగారయ్యగా నాగేశ్వరరావు, కామ[illegible] నాయుడుగా ఎస్. వి. రంగారావు బా[illegible] నటించారు. ఏ రకం పాత్రనైనా పోషించ[illegible] గల సిదహస్తుడు ఎస్. వి. రంగా[illegible]



"సతి సక్కుబాయి"లో ఎస్. వరలక్ష్మి, రేలంగి

చిత్రంలో హాస్యపాత్రను ...చి ప్రేక్షకుల మన్నన లందుకున్నాడు. యముడు వేషంలో కూడా ...పన బాగా రాణించాడు. జమీందారుగా ॥ శివరామకృష్ణయ్య, శేతన్నగా ...టుంబరావు, రంగబాబుగా చలం, అన్న...ర్తగా అమ్మాజీ, పూజారిగా దొరస్వామి ...ంగలకువారు నటించారు.

ఈ చిత్రం ఈనెల 16వ తేదీన విడుదలకు ఒకరోజుముందు న్యూగ్లోబ్ థియేటరులో పత్రికా విలేఖరులకు, తదితరులకు చూపించారు. ఆరోజున థియేటరు ప్రేక్షకులతో కలకలలాడింది. భానుమతి, జి. వరలక్ష్మి, అంజలీదేవి, జమున, కృష్ణకుమారి, జానకి, ఇంకా పలువురు తారలు, కె. వి. రెడ్డి, బి. ఎన్. రెడ్డి, పి. పుల్లయ్య, వేదాంతం రాఘవయ్య, డి. ఎల్., ఆదినారాయణరావు మొదలైన డైరెక్టర్లు, నిర్మాతలు, ఇంకా పలువురు స్క్రిప్టు రచయితలు, ఒకరేమిటి మద్రాసులోని ఫిలిం వ్యక్తుల్లో అధికభాగం ఆరోజున ప్రదర్శనానికి హాజరయ్యారు. అశ్వరాజ్ వారు తమ చిత్రం ప్రివ్యూను పెళ్లికి చేసినంత హడావుడి చేశారు. ★

## రసవంతమైన చిత్రం "విప్రనారాయణ"

ఈ యేడాది రెండు చిత్రాలు విడుదల చేసిన గౌరవం భరణీ సంస్థవారికే దక్కింది. చక్రపాణి, విప్రనారాయణ చిత్రాలు రెండూ త్వరత్వరగా నిర్మింపబడినవైనా, క్వాలిటీ ఎక్కడా చెడకుండా, నిర్మాతల శ్రద్ధకూ, చురుకుదనానికీ నిదర్శనంగా వున్నాయి.

విప్రనారాయణ ఇతివృత్తం స్వతహాగా రసవంతమైనది; ఏమాత్రం శ్రద్ధవహించి నిర్మించినా సులభంగా ప్రజల నాకర్షించే కథ గలది. భరణీవారు ఈ ఇతివృత్తానికి మెరుగులు పెట్టి, జాగ్రత్తగా ప్రతి అంశాన్నీ గుర్తుపెట్టుకుని విజయవంతమైన చిత్రం నిర్మించారు.

శ్రీరంగనాథుని భక్తుడైన విప్రనారాయణుడు తన్ను కన్నెత్తి చూడలేదని కోపంతో దురహంకారిణియైన వేశ్య దేవదేవి ఆయనను వ్రతభంగం చేస్తానని శపథం చేస్తుంది. కుహనా భక్తురాలి వేషంలో విప్రనారాయణుని ఆశ్రమంలో ప్రవేశించి తన హావభావ విలాసాలతో ఆయనను చివరికి లోబరుచుకుంటుంది. ఇద్దరికీ పరస్పరాను



సినీనటి జానకి క్రొత్తగృహానికి ఈమధ్య శంకుస్థాపనోత్సవం జరిగింది. ఆసందర్భంలో తీసిన ఫొటోలో జానకి, ఆమె భర్త శ్రీనివాసరావు, కృష్ణకుమారి మున్నగువారు.

# రసవంతమైన చిత్రం "విప్రనారాయణ"

రాగం వృద్ధిఅవుతుంది. అప్పుడు శ్రీరంగనాథుడు తన భక్తుడికి ఐహిక బంధాలనుండి విమోచనం కలిగించే ఉద్దేశ్యంతో, ఆలయంలోని కాంచనపాత్రను అపహరించిన నేరం విప్రనారాయణుడిపై పడేట్లు చేసి రాజదండనకు పాత్రుణ్ణి చేస్తాడు. విప్రనారాయణుడు తాను భగవంతుణ్ణి విస్మరించిన సంగతి గుర్తించి పశ్చాత్తప్తుడవుతాడు. రాజభటులు విప్రనారాయణుని చేతులు నరుకబోయే సమయంలో భగవంతుడు కలుగజేసుకుని అతన్ని రక్షిస్తాడు. తరువాత విప్రనారాయణుణ్ణి, దేవదేవిని తనలో ఐక్యం చేసుకుంటాడు.

ఈ చిత్రానికి దర్శకుడు రామకృష్ణ; మాటలు, పాటలు సముద్రాల; సంగీతం రాజేశ్వరరావు.

ఇప్పటికి చాలా చిత్రాలు డైరెక్టు చేసిన రామకృష్ణగారు ఈ చిత్రంతో చాలా మెట్లు పైకెక్కారు. ప్రతి సన్నివేశం రక్తి కట్టింది. సంబంధంలేని సంఘటనలతో కథ అడ్డగించబడకుండా, సాఫీగా, సులభబోధకంగా నడిచిపోతుంది. దేవదేవి విప్రనారాయణుని వశ్యుని చేసుకోవడమనేది చిత్రానికి కేంద్రం లాంటిది. ఈ కేంద్రానికి చేరుకొనే ఘట్టాలన్నిటినీ క్రమబద్ధంగా వికసింపజేస్తూ, విప్రనారాయణుని పతనాన్ని విశ్వసనీయంగా దర్శకుడు చిత్రించారు. భగవంతుణ్ణి పురుషుడుగా భావించుకొని భక్తుడు తాను రాధయై ఉపాసించడం మధురభక్తి. ఈ మధురభక్తిలో సహజంగా ఉన్న బలహీనత వైష్ణవ సంప్రదాయానికి గొడ్డలిపెట్టు. విప్రనారాయణుడు మధుర భక్తిద్వారా ఎలా పతితుడై[...] చూపించే ఘట్టాన్ని ఈ చి[...] నేర్పుతో చిత్రించారు. ఆ కీటు[...] దేవి బాగా కనిపెట్టింది. యము[...] స్థలాల్లో, గోపీజన పరివేష్టితుడై నృత్యంచేసే శ్రీకృష్ణుని శృంగారచ[...] టినీ విప్రనారాయణుడు ఊహి[...] టాడు. ఆఊహలో దేవదేవి కృష్ణుడు, [...] గోపిక. ఈ మధురభావనమండి [...] వచ్చేసరికి శ్రీకృష్ణుడూ లేడు, [...] లేరు. విప్రనారాయణుడు దేవదేవి[...] ఆలింగనం చేసుకొని సౌఖ్యపరవ[...] ఉంటాడు. దానితో అతని ప[...] ప్రారంభమవుతుంది. దేవదేవిని విడిచి మైనా గడపలేని స్థితిలో పడతాడు.

రామకృష్ణగారి దర్శకత్వానికి ద్రాలవారి చక్కని సంభాషణలు [...] నాయి. విద్యావంతులుకొని ప్రేక్ష[...] ఈ రచయిత ఉపయోగించిన పదాల తెలియకపోవచ్చునుగాని భావం స్ఫు[...] నంత కఠినంగా వ్రాయలేదు. ఉదాత్త కథావస్తువుకు తగిన ఉదాత్తశైలిలో ఆ సంభాషణలు వ్రాశారు. పాటలు కూ[...] అంతే. కొన్ని పాటలు ప్రాచీన [...] గీతాలలోని కవితామాధుర్యాన్ని పుచ్చుకున్నట్లున్నాయి. ఈ పా[...] రాజేశ్వరరావు ఇచ్చిన స్వరాలు భా[...] కంఠంలో మధురతరమైనాయి. ము[...] రాసక్రీడను వర్ణించేపాట, దాని చి[...] ఎంతో మనోజ్ఞంగా వున్నాయి.

"బృందావనిలో నందకిశోరుడు



మద్రాసు, సోషల్ ఎండ్ కల్చరల్ క్లబ్ వారు ఈనెల 5 వ తేదీన ప్రదర్శించిన "పరివర్తన" నాటకంలో మిస్ విమల, ఎస్. వి. జగ్గారావు, ఆనంద్, సి. వి. సుబ్బారావు, వెంకయ్య.



"మిస్సమ్మ"లో బడిదృశ్యం : రామలింగయ్య, ఎన్. టి. రామారావు

...దీపించే లీల"ను వర్ణిస్తూ, "మురళీ మోహనగీతికి పరవశమైనవి లోక ...బుతూ, "నారీనారీనడుమ మురారీ, ...రికీ నడుమ మయూరీ, తానొక ...లకోకరూపై, మనసులు దోచే" ...ధవుని కేళిని మధుర మధురంగా ...సిన ఆసన్నివేశం మరపురానిది. ...దేవుని "సావిరహే తవదీనా" అష్టపది, "...ర్మేదురమంబరం" అనే శ్లోకం సన్నివేశాలకు చక్కని వాతావరణం ...ర్చినవి.

మూడే ప్రధాన పాత్రలు: దేవదేవి, విప్రనారాయణుడు, రంగరాజు. భానుమతి ...ర్శకుని ఐంద్రజాలికురాలు. నాగేశ్వర...వు భక్తుడూ, ప్రేమికుడూ. రేలంగి ...గవంతుని సౌందర్యతత్త్వంలోని ...మాదాలు గుర్తించిన లౌకికుడు. శృంగారం, శాంతం, హాస్యం మూడూ మూ... పాత్రలైనాయి. నటిగా, నర్తకిగా, గాయకిగా భానుమతి సాటిలేని తార అని ...కున్నది.

...పాలు బొత్తిగా లేవని కాదు. ...గా పాటల సంఖ్య ఎక్కువైనది. ...ట్యాలుకూడా అంతే. దేవదేవి రాజాస్థానానికి రాకముందు విటులవద్ద చేసిన నాట్యాలు అంత దీర్ఘంగా చూపకపోతే బావుండేది. దర్బారులో ఆమె నృత్యం మహారాజును అలరిస్తుంది. అలరించి ఏమి చేసినట్టు? ఆ సన్నివేశం కథలో దేనికీ ఉపయోగపడలేదు.

విప్రనారాయణుడు దేవదేవికి వశ్యుడైన తరవాత కొంతభాగం లైలా మజ్నూ ఫక్కీలో నడిచింది. (డ్యూయెట్లు వగైరా -). అంతవరకూ విప్రనారాయణుని సాధించుదామనే సంకల్పం తప్ప మరోభావమే లేని దేవదేవికి అతడు వశ్యుడైన తరవాత అంత హఠాత్తుగా ప్రేమ ఎలా కలిగింది? అంతరాత్మ ఆమెను ప్రబోధించినప్పుడు కలిగిన భావం జాలి. ఆ జాలితోనే ఆమె అతనితో నివసించడానికి నిశ్చయిస్తుందిగాని ప్రేమవలన కాదు. కాని తర్వాత సన్నివేశాలలో అది ప్రేమగా చూపబడింది.

తనమాట నెగ్గేదాకా నిద్రపోనంత పట్టుదల, ఎవర్నీ లక్ష్యం చెయ్యని వ్యక్తిత్వం కలిగిన దేవదేవి తన తల్లి తన్ను ప్రియునికి దూరం చేస్తుంటే నిస్సహాయత ప్రకటిస్తుంది. ఆ సన్నివేశం ఆమె స్వభావానికి విరుద్ధంగా కనిపిస్తుంది. అక్కడ దర్శకుడు మరికొంత శ్రద్ధవహించి ఇంకా విశ్వసనీయంగా దాన్ని చిత్రించి వుండాల్సింది.

చిత్రం నిండా భానుమతే కనిపిస్తుంది. నాగేశ్వరరావు భక్తుడుగా మొదటిసారిగా నటించినా బాగానే నటించాడు. కాని భానుమతి చలాకీతనానికి సరిపడినంత భక్తి పారవశ్యంతో నటించలేదనిపిస్తుంది. ఆమె శృంగారచేష్టలు ఈయనలో ఏ భావాలు కలిగించాయో కనిపెట్టడం కష్టమైంది కొన్నిచోట్ల.

మొత్తంమీద చూస్తే "విప్రనారాయణ" చక్కని చిత్రమనీ, ఒక స్థాయికంటె కిందికి దిగకుండా తీసిన చిత్రమని అనిపిస్తుంది. ★

## "ఖేలాఘర్" నెహ్రూ బహుమతి పొందిన పిల్లల చిత్రం

మద్రాసులోని సినీ టెక్నీషియన్ల సంఘంవారు ఈ నెల 19 వ తేదీన బెంగాలీ చిత్రం "ఖేలాఘర్" ను టెక్నికల్ పరిశీలనకోసం తెప్పించి ప్రకాష్ స్టూడియోలోని ప్రొజెక్షన్ మందిరంలో ప్రదర్శించారు. అరోరా ఫిలిమ్ కార్పొరేషన్‌వారు

# "ఖేలాఘర్" నెహ్రూ బహుమతి పొందిన పిల్లల చిత్రం

నిర్మించిన ఈ చిత్రం ప్రత్యేకంగా చిన్న పిల్లలను దృష్టిలో పెట్టుకుని తీసినది. కథా వస్తువు, ట్రీట్ మెంట్ పిల్లలకు మాత్రమే నచ్చే విధానంలో ఉన్నందువల్ల ఈ చిత్రం పెద్దవారి నంతగా ఆకర్షించే అవకాశం లేదు.

ఈ యేడాది ప్రభుత్వం ఫిలిమ్ కళ కోసం చేసిన మంచిపనుల్లో ఒకటి, పిల్లల చిత్రాల్లో ఉత్తమమైనదానికి ఏటా బహుమతులిచ్చే ఏర్పాటు చేయడం. పిల్లలకు అనువైన చిత్రాలమీద మన దేశంలో ఇంతవరకూ ఎవరూ శ్రద్ధతీసుకోలేదు. చెదురుగా కొన్ని చిత్రాలు తయారైనా, అవి సముద్రంలో కాకిరెట్టమోస్తరె అయిపోయాయి. పెద్దల చిత్రాలతో ఇవి ఏవిధంగానూ పోటీ చేయలేకపోవడమే ఇందుకు కారణం. ప్రభుత్వం వెనకవుండి ప్రోత్సహిస్తే తప్ప ప్రైవేటు నిర్మాతలు ఈ విషయంలో ముందుకు రారు. ఇకముందు ప్రభుత్వం పిల్లల చిత్రాలపై ఇతోధికమైన శ్రద్ధ కనబరిచేటట్టే వున్నది.

ఈ యేడాది పిల్లల చిత్రాలలో ఉత్తమ చిత్రం అనదగినదేదీ రాకపోవడంవల్ల గుడ్డిలో మెల్ల అన్నట్టు ఉన్నవాటిలో వేమాని బెంగాలీచిత్రం "ఖేలాఘర్"కు నెహ్రూ యోగ్యతాపత్రం ఇచ్చారు.

ఖేలాఘర్ అంటే బొమ్మరిల్లు అని అర్థం. రకరకాలైన ఆటవస్తువులను అమ్మే ఒక షాపు ఉంటుంది. షాపుదగ్గర నిలబడి ఒక బీద కుర్రవాడు ఆటవస్తువులకేసి ఆశగా చూస్తూంటాడు. ధనవంతుల పిల్లలు వచ్చి ఎవళ్ళకి కావలసిన బొమ్మలు వాళ్లు కొనుక్కుపోతుంటారు. షాపు య బీదకుర్రవాణ్ని తన్ని తరిమివేస్తా రాత్రి ఆ కుర్రవాడు షాపు బయట నిద్రపోతాడు. నిద్రలో కల. లోప ఒక బొమ్మ మనుష్యరూపంతో అత వచ్చి లేపి బొమ్మల అంగడిలోకి పోయి రకరకాల బొమ్మలను అతనికి స్తుంది.

ఏదో మంత్రశక్తివల్ల బొమ్మలన్ని ప్రాణం వస్తుంది. అన్నీ లేచి ఆడ పాడుతూ ఆ బాలుడికి ఆనందం క స్తాయి. రాచకుమార్తెలు, రాజకుమ సిపాయిలు, నేపాళ మాంత్రి దయ్యాలు, సింహాలు, మొసళ్ళు ఇ మిటి రకరకాల బొమ్మలు కనిపిస్త చివరి కతడు విమానము ఎక్కి లోకంలో నూలువడుకుతున్న అవ్వ దాకా వెళ్తాడు. తిరిగి వచ్చేటప్పుడు వి



ఇనప్పెట్టె తాళంచెవులను ఇవ్వమని గద్దిస్తున్నాడు కొడుకు
రాగిణీవారి "అర్ధాంగి"లో శాంతకుమారి, జగ్గయ్య

గాలుతుంది. దాంతో ఆ కుర్రవాడికి షువ వస్తుంది.

క్షిప్తులో గాని, దర్శకత్వంలో గాని విశేషం లేదు. బాగా వేగంగా ంటూ చూసేవారికి ఉద్రేకం, త్సాహం కలిగించడానికి బదులు, ఇది మురికోళ్ళ చిన్న చిత్రమైనా విసుగు కలిగింది. ప్రొడక్షన్ విలువల దృష్ట్యా తంలో పేదరికం చాలా కనిపిస్తుంది. ంటసీ చిత్రానికి ముఖ్యంగా కావలసి భారీసెట్లు టెక్నికల్ ప్రావీణ్యమూ. చిత్రంలో అవి లేవు. నిర్మాతలు బహుశా లోపం, పరికరాల లోపం మొదలైన బ్బందులకులోనై వుంటారని అనిపిస్తుంది. మనప్పటికీ వారిలో ఉత్సాహలోపం సే అనాలి. ఎవరూ సాహసించని ఒక కి వారు సంకల్పించినందుకు అభినందించాలి. బెంగాలీనిర్మాతలలో కొత్త బలు తొక్కి, కొత్త ప్రయోగాలు చేయాలనే ఈ ఉత్సాహం మొదటినుంచీ ది. అందుచేతనే మిగతా ప్రాంతాల ంచికంటె బెంగాల్ నుండి ఎక్కువ ఖ్యలో మంచి చిత్రాలు వెలువడినై. ★

## విండ్‌లాండ్‌లో ఎమ్.జి.ఎమ్. వారి సినిమాస్కోప్ చిత్రం

చాలా నెలలనుంచీ మరమ్మతుల మూలంగా మూసివేయబడివున్న విండ్‌గాండ్ సినిమా తిరిగి తెరవబడింది. థియేటరులో చాలా మార్పులు చేశారు. సీటింగ్ ఏర్పాట్లు బాగున్నాయి. సినిమాస్కోప్ తెర మాత్రమే కాక ఎమ్. జి. ఎమ్. వారి కొత్తటెక్నిక్‌లో పర్‌స్పెక్టా స్టీరియోఫోనిక్ సౌండ్ పరికరాలు కూడా అమర్చారు. ఈ నెల 20 వ తేది రాత్రి ఆ థియేటరులో ఎమ్. జి. ఎమ్. వారి "సెవెన్ బ్రైడ్స్ ఫర్ సెవెన్ బ్రదర్స్" అనే సినిమాస్కోప్ చిత్రం కొందరు పురప్రముఖులకు ప్రదర్శించి చూపారు. ముఖ్యమంత్రి కామరాజనాడార్ కూడా హాజరయ్యారు.

★



## "అంబర్టో డి"

డీసికా తీసిన చిత్రాల్లోకల్లా ఉత్తమోత్తమమని పత్రికలూ, విమర్శకులు ప్రశంసించిన "అంబర్టో డి" అనే ఇటాలియన్ చిత్రాన్ని బ్రిటిష్ లయన్‌వారు లండన్‌లో విడుదల చేస్తారట. ఆ కంపెనీ వారు ఈ చిత్రాన్ని కొనివేసి, రెండేళ్లకు పైగా తొక్కిపట్టి వుంచినందుకు పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. తత్ఫలితంగా ఈ చిత్రం ఇప్పుడు విడుదల అవుతున్నదట.

## చాప్లిన్ చిత్రం

అమెరికన్ మోడల్ ప్రజాస్వామ్యం మీద చాప్లిన్ తీయదలచిన వ్యంగ్య చిత్రానికి ఔట్‌డోర్ దృశ్యాలు తీయడం స్విట్జర్లెండులో ప్రారంభమైనదట. ప్రజాహితకార్యాలకు అణుశక్తిని ఉపయోగింపదలచిన ఒక రాజు సింహాసనభ్రష్టుడు కావడం దీనిలో ఇతివృత్తమట. ఇన్‌డోర్ షూటింగ్ ఫిబ్రవరిలో లండన్‌లో ప్రారంభమవుతుందట.

## సొహ్రాబ్ మోడీ కొత్త చిత్రం

ప్రసిద్ధనిర్మాత సొహ్రాబ్ మోడీ కొత్తగా విడుదలచేసిన "మీర్జా ఘాలిబ్" చాలా బాగున్నట్లు పత్రికలన్నీ ప్రశంసించాయి. సుమారు నూరేండ్లక్రిందట మొగల్ సామ్రాజ్యపు ఆఖరి దినాల్లో వర్థిల్లిన గొప్ప ఉర్దూ కవి జీవితం ఆధారంగా ఈ చిత్రం తీయబడినది. అతడు వ్రాసిన ఘజల్ గీతాలు

ఉరికంబం ఎక్కించటానికి ఒక నేరస్థుని కొందరు పోలీసులు కొంతదూరం నడిపించుకు పోతున్నారు. ఉన్నట్లుండి వర్షం కురవ నారంభించింది.

తడిసిపోతూన్న ఆ నేరస్థుడు "అబ్బ - పాడువాన" అన్నాడు.

ఇహ ఆ పోలీసులకు కోపం ఆగిందికాదు "నీ కేం బా బూ ఫరవా లేదు ... మళ్లీ ఠాణాకు తిరిగి వెళ్లేటప్పుడు ఇంకోమారు తడవాలి మేము" అన్నారు.

—జి. వి. జి. కృష్ణ, మద్రాస్.

## రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

"మిస్సమ్మ"లో రామారావు, రేలంగి



"సతీసక్కుబాయి"లో శివరావు, రేలంగి

ఉత్తర హిందూస్థానంలో బహుళప్రచారంలో ఉన్నాయి. మిర్జా ఘాలిబ్ గా భారత్ భూషణ్, అతని భార్యగా నిగర్ సుల్తానా, ప్రేమికురాలుగా సురయ్యా నటించారు. సంగీతం అత్యుత్తమంగా ఉందని పలువురు ప్రశంసిస్తున్నారు.

## జనవరిలో తెలుగు చిత్రాల

విజయావారి "మిస్సమ్మ" సంక్రాంతికి రాగిణీవారి "అర్థాంగి" జనవరి 26 వ తేదీ విడుదల కాగలవని తెలుస్తున్నది.

## హల్లా గుల్లా

భగవాన్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి నాల్గవ చిత్రం "హల్లా గుల్లా" త్వరలో ఆంధ్రలో విడుదల కానున్నది. ఇందులో భగవాన్ సజ్జన్, షకీలా మున్నగువారు నటించారు. సంగీతం, హాస్యం, నృత్యం ప్రధానం గల ఈ చిత్రానికి దక్షిణప్రాంతపు డిస్ట్రిబ్యూటర్లు ఎ. వి. ఎమ్. వారు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press. 7.Thambu Chettv St. Madr

